నెహ్రూ బాల పుస్తకాలయం - 20

# స్వాతంత్ర్య గాథ

(రెండవ భాగం)


రచన :

సుమంగళ్ ప్రకాశ్

అనువాదం :

బి. రజనీకాంత రావు





నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

న్యూఢిల్లీ

మే 1974 (వైశాఖము 1896)
May 1974 (Vaisakha 1896)



రూ. 1-50

STORY OF SWARAJYA — PART II (TELUGU)

డిస్ట్రిబ్యూటర్స్ :
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
రాష్ట్రపతి రోడ్డు, సికింద్రాబాదు.

ఫోటోలు :
పబ్లికేషన్స్ డివిజన్,
మినిస్ట్రి ఆఫ్ ఇన్‌ఫర్మేషన్ అండ్
బ్రాడ్‌కాస్టింగ్ సౌజన్యంతో

PUBLISHED BY THE DIRECTOR, NATIONAL BOOK TRUST, INDIA A-5, GREEN PARK, NEW DELHI-16 AND PRINTED AT STREE SEVA MANDIR PRESS, MADRAS-17. COVER AND ILLUSTRATIONS PRINTED AT THOMSON PRESS (INDIA) LTD., FARIDABAD, HARYANA.

# వందేమాతరం

వారణాసి పుర వీథులలో జనం గుంపులు గుంపులుగా పొంగి పొరలుతూ ఉన్నారు. ఒక పెద్ద ఊరేగింపు 'గాంధీజీకి జై' అనీ 'వందేమాతరం' అనీ నినాదాలు చేస్తూ కదిలిపోతూ ఉంది. జనంలో హద్దులేని ఆవేశం మిన్ను ముట్టుతూ ఉంది. క్రీ. శ. 1919 లో జరిగిన జలియాన్ వాలా బాగ్ హత్యాకాండనూ, పంజాబులో జరిగిన దౌర్జన్యాలనూ గురించిన పూర్తి వివరాలు ఒకటీ ఒకటిన్నర యేళ్లలో జనంలో బాగా ప్రచారం పొందాయి. దానివల్ల జనంలో బ్రిటిషు ప్రభుత్వం పైని అలక్ష్య భావం పెరుగుతూ వచ్చింది. వేలకొలది కంఠాల నుంచి వెలువడిన ఆ నినాదాలు ఆకాశాన్ని దద్దరిల్ల చేశాయి. అకస్మాత్తుగా వారి పైని పోలీసులు దాడి చేశారు. పారిపోతున్న వారిని తరిమి తరిమి పట్టుకోడం మొదలుపెటారు. ఆ గుంపులో ఒక 13, 14 ఏళ్ల అబ్బాయి కూడా ఉన్నాడు. అతడు ఎంతో ఆవేశంతో 'వందేమాతరం' అని కేక వేస్తున్నాడు. పోలీసులు అతనిని కూడా పట్టుకున్నారు.

ఈ సంఘటన 1921 లో - గాంధీజీ నాయకత్వం కింద సహాయ నిరాకరణోద్యమం నానాటికి తీవ్రం అవుతున్న రోజులలో జరిగింది. అతని పేరు చంద్రశేఖర్. మేజిస్ట్రేటు సమ్ముఖంలో అతనిని హాజరు పరిచినప్పుడు అతని పేరడిగితే, అతను సగర్వంగా తల ఎగరవేసి, 'ఆజాద్' (స్వతంత్రుడు) అని చెప్పాడు. అతనిని కొరడాతో కొట్టమని శిక్ష వేశారు.

చెరసాలలో అతని దుస్తులు ఊడలాగి కొరడాతో కొట్టనారంభించారు. మొదటి కొరడా దెబ్బకే అతనికి కళ్లు మిరుమిట్లు కొలిపాయి. అయినా ఆ దెబ్బకి వదిలిన నిట్టూర్పుతోనే 'వందేమాతరం' అని కేకేశాడు.

దెబ్బ వెంట దెబ్బగా కొరడా ఛెళ్లు మంటూనే ఉంది. దెబ్బ దెబ్బకీ అతను మరింత ఆవేశంతో 'వందేమాతరం' అని అరుస్తూనే అలా దెబ్బలు తిని తిని తెలివి తప్పి పడిపోయాడు.

ఈ వీర బాలుడే ఆ తరువాత 'చంద్రశేఖర ఆజాద్' అనే పేరుతో ప్రసిద్ధికెక్కాడు. అతని గొప్పతనం చాటే విషయాలు ఇంకా ముందు తెలుస్తాయి.

1905 నాటి వంగ విభజనకు తరువాత దేశంలో హింసాత్మకమైన విప్లవ వాదం తలయెత్తిందని స్వాతంత్ర్య గాథ మొదటి భాగంలో తెలియజేశాం. ఆంగ్ల ప్రభుత్వాన్ని సమర్థించే వారి పలుకుబడి తగ్గుతూ వస్తోంది. విప్లవకారులు గుట్టు చప్పుడు కాకుండా కొనసాగించే కార్యకలాపాలు ఎక్కువవుతూ వచ్చాయి. వారు వెతికి వెతికి, అత్యాచారాల వల్ల అపకీర్తి పొందిన ఆంగ్లేయ ఉద్యోగులను హత్య చేస్తూ వచ్చారు. ఇంకొక పక్క లోకమాన్య తిలక్కూ, లాలా లజపతిరాయ్, విపిన చంద్రపాలూ వంటి నాయకుల ప్రతిష్ఠ దేశంలో ఎక్కువవుతోంది. ఇన్నీ చేరి, సామాన్య జనంలో బ్రిటిషు పరిపాలనపై వ్యతిరేకత నానాటికి హెచ్చవు

తోంది. దానివల్ల బ్రిటిషు పాలకులకి గంగ వెర్రులెత్తి దమనకాండ ప్రారంభిం చారు. ఏరి ఏరి పెద్ద పెద్ద నాయకులను బందీలుగా పట్టుకుని చెరసాలలో వేస్తూ వచ్చారు.

అందుచేత జన సామాన్యంలో మరింత అసంతుష్టి పెరిగిపోయింది. చివరికి ప్రభుత్వం లొంగక తప్పలేదు. వారు వంగ విభజన రద్దు చేశారు. ప్రజలే గెలిచారు.

కొంతకాలం అయాక, 1914 లో యూరప్‌లో మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభం అయింది. అది నాలుగేళ్ల వరకు సాగింది. యుద్ధపు ఖర్చు జరుగు బాటు కావడానికి గాను మన దేశంలో డబ్బు పిండి పిండి ఇంగ్లాండ్ పంపించేవారు. ఇక్కడి భాగ్యవంతులనుంచీ పేదవారినుంచీ కూడా పెద్ద పెద్ద మొత్తాలు వసూలుచేసి యుద్ధంకోసం పంపుతూండేవారు. నానాటికీ ధరలు పెరిగి పోతూవచ్చాయి. నిత్యావసరాలకి పనికివచ్చే ప్రతి వస్తువు ధరా మూడు నాలుగు రెట్లు పెరిగిపోయింది.

యూరప్‌లో యుద్ధం మొదలు పెట్టగానే భారతదేశంలోని ఉగ్రవాదులు దానినుంచి తమ ఉద్యమానికి ప్రయోజనం సాధిద్దామని ఆశించారు. లాలా హర్ దయాల్, రాజా మహేంద్ర ప్రతాప్‌సింహ, ఒబేదుల్లా మున్నగు ఉగ్రవాద నాయ కులు ఆ సమయంలో విదేశాలలో ఉన్నారు. వారు జర్మనీతో రాయబారం చేసి మన దేశానికి రహస్య మార్గాన ఆయుధాలను పంపడానికి ఏర్పాట్లు చేసు కున్నారు. అమెరికాలో కూడా అక్కడుండే పంజాబీలు గదర్ పార్టీ అనే రహస్య విప్లవవాదుల సంఘాన్ని ఏర్పరచుకున్నారు. విదేశాలలో ఎక్కడెక్కడయితే భారతీయులున్నారో అక్కడివారు రహస్యంగా విప్లవకారుల దళాలలో చేరుతూ వచ్చారు. ఆయుధాలను కొనడానికి కూడా విరాళాలకోసం ఆయా దేశాలకు వెళ్లారు. బెంగాల్, పంజాబ్ ప్రాంతాల విప్లవకారుల వద్ద ఆయుధాలు పట్టు బడుతూ వచ్చాయి. 1915 ఫిబ్రవరి నాటికి భారతీయ విప్లవకారులు ఆంగ్లేయులకి వ్యతిరేకంగా తిరుగుబాటు చెయ్యడానికి ప్రయత్నాలు పూర్తిచేశారు. వారి నాయకులు రాస్‌బిహారీ బోసూ, జతీన్ ముఖర్జీ. యూరప్ యుద్ధంలోకి భారతీయ సైనికులను ప్రియంగా పంపుతూండడం చేత ఇక్కడ సైన్యాలు తక్కువగా ఉండేవి. తెల్లవారి సంఖ్య బొత్తిగా తగ్గిపోయింది. తిరుగుబాటు జరపడానికి ఇంత కంటె మంచి అవకాశం దొరకదు. అయితే విప్లవకారులు నిర్ణయించుకున్న రోజుకు ముందుగానే వారి పథకం అంతా ప్రభుత్వానికి వెల్లడి అయింది. విప్లవకారు లను వెతికి వెతికి పట్టుకోవడం మొదలుపెట్టారు. పంజాబ్ నుంచి బెంగాల్ వరకూ నేరస్తులైన వారినీ కానివారినీ అన్ని తరహాల వారినీ పట్టుకుని చిత్ర హింసలు పెట్టారు. విప్లవం విఫలం అయింది. విప్లవ నాయకుడు జతీన్ ముఖర్జీ

పోరాడుతూ పోరాడుతూ చనిపోయాడు. రాస్‌బిహారీ బోస్ ప్రభుత్వానికి దొరక కుండా తప్పించుకుని జపానుకు పారిపోయాడు.

ప్రభుత్వంవారి దమనకాండ తీవ్రం అయినకొద్దీ, ప్రజల కోపం కూడా ప్రచండం అవుతూ వచ్చింది.

బాలగంగాధర తిలక్ తన కారాగార శిక్ష పూర్తిచేసుకుని, యుద్ధం మొద లవుతూ ఉంటే, విడుదల అయినాడు. ఆయన లోక ప్రియత్వానికీ శ్రద్ధకూ ముగ్ధులై దేశ ప్రజ ఆయనకు లోకమాన్యుడని అభిమాన బిరుదం ఇచ్చారు. 1916 లో లక్నోలో జరిగిన కాంగ్రెస్‌లో మితవాదుల పలుకుబడి తగ్గిపోయి, స్వరాజ్యవాదులది పైచేయి అయింది. ఈ మహా సభలో భారతదేశపు హిందూ ముసల్మాను నాయకులు బ్రిటిషువారి చేతినుంచి భారతీయుల చేతులలోనికి పరిపాల నాధికారము హక్కు భుక్తము చేసుకోడానికి ఒక పథకం ఆలోచించారు. యుద్ధం అయిపోయిన వెంటనే భారతదేశపు పరిపాలనాధికారం భారతీయులకు హస్త గతం చేస్తామని బ్రిటిషువారు వాగ్దానం చేసినట్లయితే, భారత పౌరులు బ్రిటిష వారితో పూర్తిగా సహక రించి యుద్ధరంగంలోకి ఉరకగలరని దేశీయ నాయకులు బ్రిటిష ప్రభు త్వానికి నచ్చచెప్పారు.

లోకమాన్య బాలగంగాధర్ తిలక్



ఈ నడుమ మరొక కొత్త సంఘటన జరిగింది. వయోవృద్ధురాలూ, సుశి క్షితురాలూ అయిన అనీ బిసెంట్ అను ఐరిష మ హిళ భారతదేశంపట్ల అపరిమితమైన ప్రేమా, హిందూ ధర్మం అంటే ఎంతో శ్రద్ధాభక్తులు కలది. ఆమె భారతదేశ మును భారతీయులనే పరి పాలించుకోనివ్వాలి అని కోరడం కో సం 'హోం రూల్ లీగ్'

అనే సంస్థ నెలకొల్పి దేశంలో నాలుగు పక్కలా సంచారం చేసింది. ఈ పేరుతో లోకమాన్య తిలక్ కూడా నెలకొల్పారు. ఒక విదేశీ మహిళ ఈ విధమైన ప్రచారం చెయ్యడంతో స్వరాజ్యవాదులకు ధైర్యం మరింత హెచ్చింది. 1917 నాటికి యూరప్‌లో యుద్ధం మొదలయి మూడేళ్ళు కావస్తోంది; ఆంగ్లేయులకి ఓటమి తరువాత ఓటమి సంభవిస్తూ వచ్చింది; మనవారు స్వరాజ్యం కావాలని మరింత గట్టిగా అడుగుతూ వచ్చారు. ప్రభుత్వంవారు నానాటికీ పెరుగుతున్న తిలక్, అనీ బిసెంట్ గారల ప్రభావాన్ని తగ్గించడానికి చేసిన ప్రయత్నాలన్నీ విఫలం అయినాయి.

అనీబిసెంట్



చివరికి బ్రిటిషు ప్రభుత్వానికి అధైర్యం కలిగింది. వారు 1917 ఆగష్టులో పరిపాలనలో కొన్ని బాధ్యతలను భారతీయులకు కూడా అప్పగించడానికి తాము ఇష్టపడుతున్నామని ప్రకటించారు. ఈ ప్రకటన స్వరాజ్యవాదులకు సంతుష్టిని కలిగించలేదు గాని వారి కోపం కొంత తగ్గింది.

1918 లో మహాయుద్ధం పూర్తి అయింది; బ్రిటిషు వారికి విజయం లభించింది. అయితే, వారు పరిపాలనా బాధ్యతలలో కొన్నిటిని భారతీయుల పరం చెయ్యడానికి ప్రకటించిన ప్రణాళిక భారతీయులందరికీ ఎంతో నిరాశ కలిగించింది. భారతీయులు అంతకంటె ఎంతో ఎక్కువ దక్కగలదని ఆశించారు.

అయినా కూడా, స్వరాజ్యవాదులు ఇచ్చిన అధికారాలేవో పుచ్చుకుని ముందుకు సాగిపోవాలని నిశ్చయించారు.

# రౌలట్ చట్టమూ జలియాంవాలా బాగ్

అయితే మన దేశంలోని ఆంగ్లేయ ఉద్యోగులకి మాత్రం బాగా కడుపుమండింది. యుద్ధం రోజులలో స్వరాజ్యవాదులవల్లా విప్లవవాదులవల్లా తమకు కలిగిన చికాకులకు ప్రతీకారం తీర్చుకోదగోరారు. విప్లవవాదుల రహస్య కార్యకలాపాలను గట్టిగా అణచి వెయ్యడానికిగాను ఎవరినైనా సరే విచారణ లేకుండానే చెరసాలలో పెట్టించే అధికారంతో రౌలట్ చట్టం అనే దుర్మార్గ శాసనం తయారు అయింది. ప్రభుత్వ ఉద్యోగులకూ, భారతీయ నాగరిక పౌరులకూ మధ్య పరస్పర విశ్వాసం ఈ చట్టంతో పూర్తిగా నాశం అయిపోయింది.

భారతదేశ ప్రజలు అంతా ఈ దుష్ట చట్టాన్ని ఏకగ్రీవంగా ఖండించారు.

ఈ సమయంలోనే గాంధీ మహాత్ముడు మొదటిసారిగా అహింసా, సత్యాగ్రహాలను బ్రిటిషువారిపై చేసే పోరాటంలో ఆయుధాలుగా ఉపయోగించాలని ఉపదేశించారు. ఆయన దక్షిణ ఆఫ్రికాలో సత్యాగ్రహమనే అస్త్రాన్ని ప్రయోగించి చేసిన పోరాటం సఫలం అయింది. ఈ ఉపదేశం ప్రకారం – హింసాకాండ జరిపేవారంటే భయపడకూడదు. ప్రతీకారం చెయ్యకపోయినా కూడా ఎవరయినా బాధిస్తూంటే సత్యమైన హక్కులకోసం (బాధను సహిస్తూ ధైర్యంగా) నిలబడాలి. బాధ పెట్టే వాని హృదయంలో నిద్రిస్తూ వుండే కోమల భావాలను మేలుకొలపడం ఒకటీ, బాధపడుతూండే ఇతర ప్రజలందరికీ తన నిర్భయత్వం గుణపాఠం కావడం ఒకటీ – దీనివల్ల రెండు ప్రయోజనాలు.

ఇదికూడా ఒక పోరాటమేనా అని శ్రోతలు హేళన చేసేవారు. అయితే గాంధీజీ దక్షిణాఫ్రికాలోని భారతీయులపట్ల జరుగుతూ ఉన్న అన్యాయాలను ఎదిరించడానికి ఈ పద్ధతి శాంతి సమరమే జరిపారు; సత్యాగ్రహుల సేనను

కూడా ఏర్పాటు చేశారు. ఈ శాంతి యోధులు కిమ్మనకుండా చేతులు కట్టుకుని పోలీసుల లాఠీ దెబ్బలు తిని, నవ్వుతూ చెరసాలకు వెళ్లేవారు. ఈ నిరాయుధులైన సత్యాగ్రహులు కేవలం సత్యం అహింసా ఆయుధాలుగా ఆ విధంగా దౌర్జన్యాన్ని ఎదుర్కొంటూంటే శ్రోతలూ, ప్రేక్షకులూ విస్మయంలో మునిగిపోయేవారు.

ప్రపంచ మహా యుద్ధపు రోజులలోనే గాంధీజీ స్వదేశానికి తిరిగి వచ్చారు. సత్యాగ్రహం అంటే విశ్వాసం గల కొందరి తోడ్పాటుతో గుజరాత్‌లో ఆయన సత్యాగ్రహాశ్రమాన్ని ప్రారంభించారు. ప్రభుత్వం వల్ల జరుగుతున్న అన్ని విధాల అన్యాయాలకు, అత్యాచారాలకు విరుద్ధంగా గాంధీజీ మెల్లి మెల్లిగా తన సత్యాగ్రహాయుధాన్ని ప్రయోగింప నారంభించినది ఇక్కడి నుంచే! బీహార్‌లోని చంపారన్ జిల్లాలో రైతు కూలీలచేత నీలిమందు వ్యవసాయం చేయించే ఆంగ్లేయ గుత్తదారులు ఆ రైతుల పైని దుండగాలు జరిపించారు. ఆ రైతుల ఆహ్వానం పైని గాంధీజీ వారి తరఫున గుత్తదారులతో పోరాటం జరపడానికి చంపారన్ వెళ్లారు. ఆయనకు చంపారన్ జిల్లానుంచి బైటికి వెంటనే వెళ్లిపోవాలని సర్కారు హుకుం జారీ అయింది. గాంధీజీ దాన్ని లక్ష్యపెట్టకపోతే, ప్రభుత్వం ఆయనను అరెస్టుచేసి చెరలో పెట్టారు. 1918 ఏప్రిల్ 18 వ తేదీని ఆయనపైని భారతదేశంలో మొట్టమొదటి కేసు విచారణ జరిగింది. ఈ ప్రభుత్వపు ఆజ్ఞ తాను మన్నించబోననీ, ఎందుకంటే ఈ ప్రభుత్వం కంటే బలవత్తరమైన శక్తి ఒకటి ఉన్నదనీ ఆ (దైవం లేక సత్యం అనే) శక్తి ఆజ్ఞలనే తాను పాటిస్తాననీ గాంధీజీ తన వాఙ్మూలంలో చెప్పారు.

దక్షిణాఫ్రికాలో గాంధీజీ జరిపిన ఉద్యమం గురించి, మన దేశపు బ్రిటిషు ప్రభుత్వానికి తెలుసు. అందుచేత ఆయనకు శిక్ష విధించి ఇక్కడి ప్రజలను ఇంకా రెచ్చగొట్టడానికి ప్రభుత్వం సాహసించలేకపోయింది. గాంధీజీని చెరనుంచి విడుదల చేశారు. ఆ తరువాత ఆయన ఆ రైతుల మధ్య సంచారంచేసి, వారిపట్ల జరగబోయే అన్యాయాలను గురించి తెలుసుకున్నారు. చివరికి ఆయన అభి ప్రాయాన్ని అనుసరించి, ప్రభుత్వం ఆ రైతులపై జరగబోయే దురయాలను అరికట్టే చట్టం మంజూరు చెయ్యవలసి వచ్చింది.

కాని, ఈ ప్రయోగాలన్నీ చిన్న చిన్నవి. ఏ జాతీయ సమస్యలోను ఇంత వరకూ గాంధీజీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సత్యాగ్రహాయుధాన్ని (పెద్ద యెత్తున) ప్రయోగించలేదు.

అయితే, గాంధీజీకి, ప్రపంచ మహాయుద్ధం పూర్తికాగానే ప్రభుత్వం అమలు పరచిన రౌలట్ చట్టం ఆ అవకాశాన్ని కలుగజేసింది. ఆయన కొందరు సత్యా గ్రహుల తోడ్పాటుతో ప్రభుత్వాన్ని ధిక్కరిస్తూ ఉద్యమం నడపాలని నిర్ణ యించారు. అది జరిగిన యేడు 1919. ఉద్యమంలో మొత్తం దేశీయులందరి సహకారం పొందడానికి ఒక తేదీ నిర్ణయించారాయన. ఆ రోజు అంతటా వీలయి



సత్యాగ్రహ ఆశ్రమం

సంత మంది ప్రజలు పగలంతా ఉపవాసం ఉండి, సాయంత్రం సభ చేసి, అందులో ఆ దుష్ట చట్టాన్ని తిరస్కరించారు. అది ఏప్రిల్ 6 సత్యాగ్రహం రోజు అని ప్రసిద్ధిపొందింది.

దేశం అంతటా గొప్ప ఆవేశ తరంగం ప్రాకిపోయింది. అయితే ప్రభుత్వం పెట్టే బాధలను శాంతి సహనాలతో ఓర్చుకోవాలి అన్నమాట మాత్రం మర్చిపోయారు ప్రజ! ఆ రోజున చాలాచోట్ల చాలామంది ప్రజలు ఆవేశపూరితులై తిరగబడిలేచారు. పోలీసులు వారిపై తూటులు కాల్చారు. దాని మూలంగా ఎంతోమంది మరణించారు. ఎంతోమందికి గాయాలు తగిలాయి. ప్రభుత్వం ఇంకా దుర్నయాలు చెయ్యనారంభించారు – దేశం అంతటిలోనూ విప్లవకారులు ఎక్కువగా ఉన్నారనే భయంకొద్దీ తమ దమనకాండ పంజాబ్‌పై ఎక్కువగా సాగించారు. యుద్ధానికి పంపిన సైనికులలో పంజాబీలు చాలామంది ఉండేవారు. యుద్ధరంగంలో వారు చూపే ధైర్య సాహసాలు యూరప్ వారికి ఎంతో ఆశ్చర్యం కలిగించేవి. అయితే, బ్రిటిషు ప్రభుత్వానికి ఈ సైనికులకు ఏ విధమైన ప్రోత్సాహం ఇయ్యడానికి ఇష్టం

ఉండేది కాదు. వారు గాని ఆంగ్లేయాధికారుల నుంచి సైన్యంలో అధికారం లాగుకోవడం మొదలుపెడితే దానివల్ల భారతీయ స్వరాజ్యవాదులు మరింత బలం పుంజుకుంటారని ప్రభుత్వానికి భయం! అందుకని అప్పటిలో పంజాబులోని పెద్ద పెద్ద నాయకులను మెల్లిమెల్లిగా చెరసాలకు పంప నారంభించారు.

ప్రజలలో ఆవేశం ఇంకా హెచ్చిపోయింది. పెద్ద పెద్ద సభలూ సమావేశాలు జరిగాయి. పంజాబు ప్రభుత్వపు దమనకాండ మరింత కఠోరం అయినకొద్దీ ప్రజలలో ఆవేశం వశం తప్పింది. ఆంగ్లేయులను ఒక్కొక్కరిని పట్టుకుని ప్రతీకార చర్యగా వధించడమూ, వెలగల ప్రభుత్వ సామగ్రులకు నష్టం కలిగించడం మొదలు పెట్టారు. అప్పుడు జరిగినదే జలియాంవాలా బాగ్‌లో బ్రిటిషువారు జరిపిన భీషణ నర సంహారం.

ఏప్రిల్ 13 వ తేదీ సాయంత్రం అమృతసర్‌కు చెందిన జలియాంవాలా బాగ్ మైదానంలో ప్రజలు ఒక మహాసభ జరుపుకుంటున్నారు. 'హిందూ దేశీయులకు కలకాలం మరిచిపోని పాఠం చెప్పా' లని నిశ్చయం చేసుకున్న జనరల్ డయర్ అనే ఆంగ్లేయ సేనాని 100 మంది భారతీయ సిపాయీలతో, 50 మంది తెల్ల సైనికులతో అక్కడికి చేరుకున్నాడు. అక్కడ సమావేశమైనవారు నిరాయుధులైన సుమారు ఇరవై వేల ప్రజ-పిలలున్నారు, వృద్ధులూ, స్త్రీలూ కూడా ఉన్నారు.

భాష్ప వాయువు ప్రయోగం



సేనాని తుపాకులు పేల్చమని ఆజ్ఞ ఇచ్చాడు - ముందు హెచ్చరికేదీ చెయ్యకుండా,- సభను సమాప్తం చేసే అవకాశం ఇవ్వకుండా, అక్కడున్న ఏ ఒక్కరికీ పారిపోయే దారి వదలకుండా! వాస్తవానికి ఈ ఆంగ్లేయోద్యోగి అక్కడికి వచ్చినది అక్కడున్న వారిని తుపాకి గుండ్లతో కాల్చి చంపడానికే! ఆ దొరికిన అవకాశాన్ని అతడు చెయిజారనీయ దలుచుకోలేదు. ఆ చిన్న మైదానానికి నాలుగు వైపులా వసతి గృహాలకు చెందిన ఎత్తైన గోడలు మూసుకుపోయి ఉన్నాయి. బైటికి పోవడానికి ఉండిన ఒక్క దారీ చిన్న ఇరుకు సందు. ఆ సేనాని తీసుకువచ్చిన సైనిక శకటం ఆ సందులోకి ప్రవేశించడానికి వీలు చిక్కలేదు. ఆ శకటం బహుశా లోపలికి పోగలిగి ఉంటే మర తుపాకులతో ఆ జనానీకంలో ఒక్క మనిషి కూడా మిగిలి ఉండేవాడు కాడు.

సిపాయిల తుపాకులనుంచి గుళ్లు ఢనాఢన్‌మని వెలువడుతూంటే జనం గుంపు భయంతో ఒకరిమీద ఒకరు పడి తొక్కిసలాడారు. ఎక్కడికి పారిపోగలరు? గుళ్లు తెంపు లేకుండా వెలువడుతున్నాయి - 1600 గుళ్లు -అన్నీ పూర్తిగాకుండానే వందల కొద్దీ జనం చనిపోయారు. ఎందరికో దెబ్బలు తగిలాయి. ఇంతకంటే ఘోరం-రాత్రి అంతా అక్కడ సెంట్రీలు పహరా ఉంది. అక్కడ చనిపోయిన వారిని గాని దెబ్బలుతిన్న వారిని గాని అక్కడినుంచి ఎవరూ తీసుకుపోకుండా కాపలా కాశారు. వారికి మందు పూతలకు గాని పట్టీలు వెయ్యడానికి గాని కూడా వీలులేదు.

అటు తర్వాతనే, అక్కడి వార్తలు పైకి పొక్కకుండా పంజాబు అంతటికీ మిగిలిన దేశంతో ఏ వార్తాసంబంధమూ లేకుండా ఆపు చేశారు. కొన్ని రోజులవరకూ వారు పంజాబు అంతటా కొన్ని వారాలపాటు కొనసాగించిన అత్యాచారాలను బట్టి, పంజాబులోని తెల్ల ఉద్యోగులకు మతులు పోయాయనీ, వారు పంజాబును కాలరాచి నాశం చెయ్యడానికి నిశ్చయించుకున్నారనీ అనిపించింది.





తమ దుండగాల సంగతి ఎవరికీ తెలియకూడదని పంజాబు ప్రభుత్వం వార్తలు బైటికి పోకుండా ఆపుచేసింది. పంజాబునుంచి పైరాష్ట్రాలకు ఎవరూ పోకూడదు, బైటివారెవరూ పంజాబు రాకూడదు. గాంధీజీ పంజాబు వెళ్లడానికి బయలుదేరితే, ఆయన్ని ఢిల్లీలోనే అరెస్టుచేసి, అహమ్మదాబాదు తీసుకు వెళ్లారు.

అయినా, ఇలాంటి దుర్వార్త ఎంతకాలం

గుట్టుగా ఉంటుంది? మెల్లిగా బైటికి పొక్కి క్రమంగా హిందూ దేశం అంతటా వ్యాపించింది. ప్రజల హృదయాలలో తుఫాను చెలరేగింది.

## గాంధీజీ సత్యాగ్రహోద్యమం

1919 ఏప్రిల్‌లో గాంధీజీ సత్యాగ్రహం చెయ్యబోతున్నానని ప్రభుత్వానికి చేసిన హెచ్చరికను అప్పటిలో ఆయన ఉపసంహరించుకున్నారు. ఎందుకంటే, తన అహింసాత్మకమైన పోరాటంలో పాల్గొనడానికి ప్రజలను సుశిక్షణతో సిద్ధం చేసే అవకాశం ఇంకా రాలేదని తోచింది. ఈ పంజాబు దురంతాలు జరిగిన నాటికి దానికి తగిన సమయం ఆసన్నమయినట్లు కనిపించింది. ఆయన సహాయనిరాకరణోద్యమం ప్రారంభించారు. 1920 లో కాంగ్రెసు ఆయనను నాయకునిగా వరించింది. దేశపు దౌర్భాగ్యంకొద్దీ, అదే సమయంలో అందరికంటే తేజస్వియైన నాయ

జలియాన్ వాలాబాగ్ స్మారక చిహ్నం



కుడు లోకమాన్య తిలక్ అప్పుడే స్వర్గస్థులుకావడం చేత దేశం అంతా శోకంలో మునిగిపోయింది. అప్పటిలో దేశానికి గాంధీజీలో ఆశాప్రదమైన కొత్త వెలుగు, కొత్త సహాయం లభించింది.

అయితే, మళ్లీ ఒకదాని తర్వాత ఒకటి బాగా విశాలమైన తరంగాలు భారత దేశం అంతటా వ్యాపించాయి – ఒక ఉత్సాహ తరంగం, ఏదో చేసిచూపించే ఆవేశం, దేశాన్ని స్వతంత్రం చెయ్యడానికి చావుకైనా వెనుదీయని కోరిక –

'తలలు పణమిడు కోర్కి మా హృది చెలగ చేరగ అదనిదే,
కాంచవలెను కసాయి చేతుల కత్తి యెంతటి పదనుదో!'
(సర్ఫరోషీ కీ తమన్నా)

ప్రతి వ్యక్తి నోటా ఈ పాట వినబడేది. 'మన శిరస్సులను పణంగా పెట్టడానికి వచ్చాం ఇప్పుడు; ఆయుధధారుల చేతులలో ఎంత తీవ్రత ఉందో చూద్దాం' అని దీని అర్థం. ప్రజలు మృత్యువును ఎదుర్కోవడానికి సంసిద్ధంగా ఉండేవారు. అంతటిది అప్పటి ఆవేశం!

తమ నాయకుల ఉపదేశాన్ని అనుసరించి వేలకొలది యువకులు పాఠశాలలను, కళాశాలలను వదిలివేసి, ఉద్యమంలోనైనా చేరేవారు, లేదా, కొత్తగా ప్రారంభించిన జాతీయ పాఠశాలలలోను, జాతీయ విద్యాపీఠాలలోను చేరి చదువు సాగించేవారు. వేలకొలది వకీళ్లు న్యాయవాదివృత్తి విడిచిపెట్టి, దేశ సేవకు దీక్ష వహించారు. అటువంటి వారిలో రాజులతో మహారాజులతో తులతూగే ఆదాయం వస్తూండే మోతీలాల్ నెహ్రూ చిత్తరంజన్ దాస్ వంటి న్యాయవాదులున్నారు. రాజ ఠీవితో దర్జాగా జీవించే జవాహర్‌లాల్ నెహ్రూ వంటి నవ యువకులు తమ సుఖ భోగాలన్నిటినీ త్యజించి సహాయ నిరాకరణం గురించి ప్రచారం చెయ్యడానికి దుమ్మూ ధూళీ అనక పల్లె పల్లెకూ పోయేవారు.

ప్రపంచ యుద్ధానికి తరువాత దేశపు శాసన నిర్మాణంలో ప్రజలను కొంత వరకు భాగస్వాములను చెయ్యడానికని బ్రిటిషువారు శాసన సభలను ఏర్పాటు చేశారు. గాంధీజీ సలహా పైని, ఆ శాసన సభలకు జరగబోయే యెన్నికలలో పాల్గొనకుండా ప్రజలు బహిష్కరించారు. వోటింగులో పాల్గొన్నవారి సంఖ్య కంటె పాల్గొననివారి సంఖ్యే హెచ్చుగా ఉండెను. అంతే కాదు; గాంధీజీ ప్రజలకు విదేశాలలో తయారై వస్తున్న వస్త్రాలను బహిష్కరించండని ప్రబోధించారు. ఈ నినాదంవల్ల ఆంగ్లేయుల స్వార్థానికి అన్నిటికంటె పెద్ద దెబ్బ తగిలింది. భారతదేశానికి వచ్చే విదేశీ వస్త్రాలలో ఎక్కువ ఇంగ్లాండ్ కార్ఖానాలలో తయారైనవి కావడంచేత చాలా లాభం వారి దేశానికి పోయేది. ఆ లాభాలను అరికట్టడానికని స్త్రీలూ, పిల్లలూ పనికట్టుకుని, ఇంటింటికీ వెళ్లి, ప్రజలవద్ద అడిగి, విదేశీ వస్త్రాలను పోగుచేసి చౌరాస్తాల వద్ద వాటికి నిప్పు ముట్టించి తగులపెట్టేవారు. పెద్ద పెద్ద విలువగల విదేశీ వస్త్రాలను కూడా వ్యామోహం విడిచి

ప్రజలు మంటలలో వేసేవారు. విదేశీ బట్టలు వేసుకోవడమే లజ్జాకరంగా భావించే వారు. విదేశీ బట్టలు ధరించినవారిని ఏవగించుకొనేవారు.

దేశభక్తు లందరినీ ఖద్దరు ధరించండని గాంధీజీ సలహా యిచ్చారు. చేతితో వడికి, చేతితో నేసిన అటువంటి ముతక నూలు బట్టలను ఆ రోజులలో గ్రామాలలో చాలా పేదవారు మాత్రమే తొడుగుకునేవారు. గాంధీజీ తాను స్వయంగా ఖద్దరు పంచె, ఖద్దరు చొక్కా వేసుకుని, తలపైని పాగాకు బదులు ఖద్దరు టోపీ ధరించ నారంభించారు. అదే టోపీ గాంధీ టోపీ అనే పేరుతో దేశం అంతటా ప్రసిద్ధి పొందింది. ఈనాటి సన్ననూలు, కొంగ రెక్కలాంటి తెల్లనూలు ఆ రోజులలో వచ్చేది కాదు. మొత్తానికి దేశ భక్తులంతా గరుకుగా ఉండే ఆ ముతక ఖద్దరునే ధరించేవారు. అందుచేత వారిలో గొప్పవారు పేదవారు అనే తేడా కనబడేది కాదు.

ఈ అపూర్వ ప్రజా చైతన్యాన్ని చూసి, గాంధీజీకి మేరలేని ఆనందం కలి



గింది. ఆయన ఒక్క సంవత్సరంలో స్వరాజ్యం సంపాదిస్తానని వాగ్దానం చేశారు-అయితే ప్రజలు ఆయన చెప్పిన షరతుల ప్రకారం నడుచుకోవాలి! అదేమిటంటే, లోకమాన్య తిలక్ స్మారకార్థం పోగుచేసిన తిలక్ స్వరాజ్యనిధి ఒక కోటి రూపాయలు చందాలద్వారా పోగుచెయ్యాలి; కాంగ్రెస్‌లో ఒక కోటి మందిని సభ్యులను చేర్పించాలి; దేశం అంతటా మొత్తం 20 లక్షల చరఖాలు పనిచేసేటట్లు చెయ్యాలి; హిందూ సంఘంలో అంటరానితనాన్ని నిర్మూలించాలి. హిందువులు, ముస్లిములు ఐకమత్యంగా ఉండాలి.

ఈ ఉద్యమం మొదలుపెట్టినప్పటినుంచీ ముసల్మానులు గాంధీజీ పతాకచ్ఛాయను చేరారు. దీనికి కారణం ఉంది: ప్రపంచ యుద్ధంలో జర్మనీతోపాటు తోడ్పడిన టర్కీ కూడా ఓడిపోయింది. టర్కీ తన సామ్రాజ్యంలోని చాలా భాగాలను వదలుకోవలసి వచ్చింది. టర్కీ పరిపాలకుడయిన ఖలీఫా ప్రపంచంలోని ముస్లిములకు ధర్మ గురువుగా ఉండేవాడు. యుద్ధం ప్రారంభించినపుడు టర్కీ జర్మనీ పక్షాన చేరినందున, బ్రిటిషువారు భారతదేశంలోని ముసల్మానులను తమ సేనలలో చేర్చుకొనేటప్పుడు ఖలీఫా ఔన్నత్యానికి ఏమాత్రమూ భంగం రానీయమని వాగ్దానం చేశారు. యుద్ధం పూర్తయాక వారు ఈ వాగ్దానాన్ని నిలుపుకోలేకపోయారు. భారతదేశంలోని ముసల్మానులు ఖలీఫాకు పోయిన అధికారాలు తిరిగి కట్టబెట్టేటందుకు ఖిలాఫత్ అనే ఉద్యమాన్ని ప్రారంభించారు. సహాయ నిరాకరణోద్యమమూ, ఖిలాఫత్ ఉద్యమమూ పరస్పర సహకారంతో కొనసాగాయి. ఖిలాఫత్ ఉద్యమ నాయకులు మహమ్మదలీ, షౌకతలీగారలు గాంధీజీ నాయకత్వమును అనుసరించారు. దేశం అంతటా హిందువులూ ముస్లిములూ అన్నదమ్ములనే భావన కలిగింది. హిందూ నాయకులను ముస్లిము నాయకులు తమ మసీదులలోనికి ఉపన్యాసాలకు ఆహ్వానించారు, ముస్లిం నాయకులతో సహపంక్తిని కూర్చుని హిందూ నాయకులు విందులలో పాల్గొన్నారు. బ్రిటిషు ప్రభుత్వానికి అన్ని వైపులా నిరాశ కలిగి, దేశంలోని బ్రిటిషు రాజభక్తుల వైపు తమ దృష్టిని మళ్లించారు. బిరుదుల ద్వారా పదవుల ద్వారా వారి హోదాలను పెంచి, బ్రిటిషు ప్రభుత్వం ఇంకా వారి విశ్వాసాన్ని ఉత్సాహాన్ని సంపాదించడానికి అయిదవ జార్జి చక్రవర్తి కుమారుడైన వేల్సు యువరాజును భారత దేశానికి యాత్రకు పంపించారు.

కాని ఆ యాత్ర ఆయన పలుకుబడికి అంతగా తోడుపడలేదు. యువరాజు బొంబాయి రేవులో ఓడ దిగిన రోజున దేశం అంతటా సంపూర్ణమైన హర్తాల్ జరిగింది. ఇంత జయప్రదమైన హర్తాల్ ఈ దేశంలో ఇంతకు మునుపెన్నడూ జరుగలేదు. ప్రిన్స్ ఆఫ్ వేల్స్ వెళ్ళినచోటల్లా జనం నల్ల జండాలతో ఎదుర్కొనివ్వడంతో, ప్రభుత్వం ఎందరినో అరెస్టు చెయ్యవలసివచ్చింది. గాంధీజీ కాక, దేశంలో దాదాపు మిగిలిన పెద్ద నాయకులందరినీ చెరలో పెట్టారు - లాలా లజపత్



రాయ్, పండిత మోతీలాల్ నెహ్రూ, ఆయన కుమారుడు జవాహర్‌లాల్ నెహ్రూ, చిత్తరంజన్ దాస్, ఆయన భార్య వాసంతీదేవి మున్నగు వారంతా అరెస్టయారు.

అప్పుడు గాంధీజీ నిర్దేశించిన నియమాలను పూర్తిగా ఆచరణలో పెట్టడానికి వేలకొద్దీ లక్షలకొద్దీ జనం అతి శీఘ్రంగా ప్రతి గ్రామమూ చేరుకుంటున్నారు. చూస్తూ చూస్తూండగానే తిలక్ స్వరాజ్య నిధికి విరాళాలు కోటి రూపాయలను మించి పోగుపడ్డాయి. అంతే కాకుండా ఆయన చెప్పిన నియమాలన్నీ ఆచరణలో పెట్టి చూపడమయింది. అందుకోసం ఇప్పుడు నాలుగు దిక్కుల నుంచీ ప్రభుత్వాన్ని ధిక్కరించి పన్నుల నిరాకరణోద్యమం జరపాలని లేదా, రైతులు భూమిశిస్తు కట్టకుండా నిలుపు చేయించాలనీ గాంధీజీ పైని ఒత్తిడి తెచ్చారు.

ఇది ప్రభుత్వానికి అన్నిటికంటే పెద్ద దెబ్బ. వారికి ఆదాయం తెచ్చే మార్గాలలోకల్లా పెద్దది మూసుకుపోతే చిక్కే కదా

మరి. మచ్చు ప్రయోగంగా గాంధీజీ తొలిసారిగా పన్నుల నిరాకరణోద్యమం గుజరాత్‌లో మొదలుపెట్ట నిశ్చయించారు. దానికోసం ప్రయత్నాలు భారీగా జరిగాయి.

## చౌరీ చౌరా తిరుగుబాటు, కాకోరీ కుట్ర

అప్పుడు ప్రభుత్వానికి ఒకటే దారి మిగిలింది; అది - దుండగాలు చేసి, ప్రజల్ని రెచ్చగొట్టి హింసాకార్యాలకు పురికొల్పడం! ఈ విధానంలో కొన్ని చిన్న చిన్న సంఘటనలు అయాక, అన్నిటిలో పెద్దది గోరఖ్‌పూర్ జిల్లాలోని చౌరీచౌరాలో జరిగినప్పుడు ప్రభుత్వంవారి కోరిక తీరింది. ప్రభుత్వపు అత్యాచారాలతో రెచ్చిపోయిన జనసమూహం ఒక పోలీస్ చౌకీకి నిప్పు పెట్టి అందులోని సిపాయిలను బతికుండగా కాల్చివేశారు.

పన్నుల నిరాకరణకి అనుకూలసమయం ఇంకా ఆసన్నం కాలేదని గాంధీజీకి తోచింది. ఆ ఉద్యమాన్ని ప్రభుత్వం అన్ని పక్కల నుంచీ అణచి వెయ్యడానికి ప్రయత్నిస్తుంది. అంతేకాక, రెచ్చిపోయిన జనం ప్రభుత్వపు దుండగాలకు దౌర్జన్యంతోనే ప్రతీకారం చెయ్యడం మొదలుపెడితే మొదలుకే మోసం!

పన్నుల నిలుపుదల ఉద్యమం మొదలు పెట్టక పోవడంతో దేశంలో అన్ని వైపులా ఆశాభంగం అల్లుకుపోయింది. సమయం చూసి, ప్రభుత్వంవారు గాంధీజీని నిర్బంధించి, ఆరు సంవత్సరాలు కారాగారంలో ఉంచారు. ఇది 1922 లో జరిగిన సంగతి.

ఆనాటికి గాంధీజీ నాగరకులైన పెద్దమనుష్యుల దుస్తులను మానివేసి, పల్లెటూరి రైతులాగ అర్ధనగ్నంగా దుస్తులు వెయ్యడం మొదలు పెట్టారు - తలపై టోపీ లేదు; పంచె చొక్కా లేదు; పంచెకు బదులు మోకాలు దిగకుండా వుండే అంగవస్త్రం చుట్టబెట్టుకునేవారు. అదే వేషంతో ఆయన న్యాయస్థానానికి కూడా హాజరయినారు. అయినప్పటికీ, ఆయన్ని చూడగానే న్యాయస్థానంలోని అన్ని తరహాల జనమూ గౌరవంతో లేచినుంచునేవారు.

తెల్లజాతి వాడైన ఒక న్యాయాధిపతి కొలువున్న న్యాయస్థానంలో విచారణ సందర్భంలో గాంధీజీ ఇచ్చిన వాఙ్మూలం ఎన్నటికీ మరువరానిది; - ఆయన ఏమన్నారంటే :-

"నేను నిప్పుతో చెలగాట మాడుతున్నానని నాకు తెలుసు. నేను ఇది తెలిసే చేస్తున్నాను. అంతేకాదు; తమరు నాకు ఏ శిక్షా విధించకుండా వదిలివేసినా కూడా, నేను తిరిగి అన్నీ చేస్తాను. నా దేశీయులు అప్పుడప్పుడు కొన్ని పిచ్చి తనపు పనులు చేస్తూంటారని నాకు తెలుసు. అందుకు నేను చాలా విచారిస్తున్నాను. అందుకని నాకు విధించే శిక్షను ఏ మాత్రమయినా తగ్గించమని



జెయిలులో గాంధీజీ

మిమ్మల్ని కోరడంలేదు. గౌరవనీయ న్యాయాధిపా, తాము అనుసరించవలసినవి రెండే మార్గాలు. ఒకటి తాము తమ పదవికి రాజీనామా ఇయ్యడం; లేదా, నాకు ఎంత కఠినాతికఠినమైన శిక్ష వెయ్యగలరో దానిని విధించండి.''

గాంధీజీని చెరసాలలో నిర్బంధించిన తరువాత ప్రజలు తాము నిస్సహాయులం అని భావించారు. అయితే, దేశం అంతా కూడా శోకాన్ని దరిజేరనీయక, గాంధీజీ ఇచ్చిన ఆదేశాలను ఆచరణలో పెడుతూ పూర్తిగా శాంతిగా ఉంటూ వచ్చారు. బ్రిటిషు ప్రభుత్వంవారు తమ దమననీతికి మంచి ఫలితం కలిగిందనీ, ప్రజల ఆవేశాన్ని బాగా అణచివేశామనీ తృప్తిపడ్డారు. ఒక ఆంగ్లేయుడు 'గాంధీని



నిర్బంధించాక – ఒక కుక్కా ఇంతవరకు మొరగనైనా లేదు' అనేవరకు పోయాడు. అయితే ఆ ఊహ ఎంత తప్పో వారికి ఆ తరువాతనే తెలియవచ్చింది.

1922 ఆరంభంలో గాంధీజీ చెరసాలలో ఉన్నారు. రెండు ఏళ్ళు పూర్తి కాకుండానే ఆయన ఆరోగ్యం బొత్తిగా చెడిపోయింది. చెరసాలలోనే ఆయనకు కడుపులో శస్త్ర చికిత్స చెయ్యవలసి వచ్చింది. ఆ సమయంలో దేశ ప్రజకు కలిగిన ఆతురతా, చింతా, గమనించిన బ్రిటిషు ప్రభుత్వానికి భయం కలిగింది. చెరసాలలో గాని గాంధీజీ ప్రాణాలు కోలుపోతే దేశంలో ఎవరూ ఆర్పడానికి వీలుకాని అగ్నిపర్వతం బద్దలవుతుందని వారికి తోచింది. దేశీయుల అదృష్టవశాత్తు శస్త్ర చికిత్స జయప్రదంగా పూర్తిఅయి ఆయన ఆరోగ్యం కోలుకున్న వెంటనే ప్రభుత్వం ఆయనను విడుదల చేశారు.

గాంధీజీ అనుచరులయిన కాంగ్రెసు నాయకులలో ఒక చీలిక ఏర్పడింది. రాజగోపాలాచారి, వల్లభాయి పటేల్, రాజేంద్రబాబూ వంటి నాయకులు ఇంకా గాంధీజీ నిర్దేశించిన విధానాలనే పాటిస్తూ వచ్చారు. కాని, చిత్తరంజన్‌దాస్, మోతీలాల్ నెహ్రూ వంటి నాయకులు సహాయ నిరాకరణ విధానంలో మార్పు రావాలని కోరారు. సహాయ నిరాకరణోద్యమం ద్వారా జనంలో రేగిన స్వరాజ్య వాంఛను

**పండిత్ మోతీలాల్ నెహ్రూ**

ప్రజ్వలింప చెయ్యాలంటే తమ సామర్థ్యం ఇతోధికంగా అభివృద్ధి చెందేటట్లుచేసే కార్యక్రమం ఏదైనా చేపట్టాలని వారి అభిప్రాయం. దాని ప్రకారం అప్పటికి రాబోయే ఎన్నికలలో శాసన సభలకు పోటీ బహిష్కరించక, వీలైనంత ఎక్కువ ప్రజా ప్రతినిధులను ఎన్నుకుని శాసన సభలకు పంపాలి. ఆ సభ్యులు శాసన సభలకుపోయి, ప్రభుత్వం ప్రవేశంపెట్టే బిల్లులకు వ్యతిరేకంగా వోటుచేస్తూ బడ్జెటును తిరస్కరించాలి. ఈ కౌన్సిళ్లు (శాసన సభలు) కేవలం పేరుకు మాత్రమే. అసలు చలాయించే అధికారం అంతా కేంద్ర ప్రభుత్వంలో వైస్రాయిదీ, రాష్ట్రాలలో గవర్నరులదీను. ఈ నామమాత్రపు కౌన్సిళ్ల గుట్టంతా ప్రపంచానికి బట్టబయలు చెయ్యాలని ఈ మితవాదుల ఆశయం.

గాంధీజీ చెరసాలనుంచి విడుదల అయి రాగానే, ఆయనను ఈ రెండు వర్గాల నాయకులూ తమ తమ మార్గాలను అనుసరిస్తూ వేరుగా పనిచెయ్యడానికి అనుమతి కోరారు. ఆ ప్రకారం వారు విడిపోయి ఎవరి మార్గాన వారు ప్రభుత్వంతో పోరాడే విధానాన్ని అనుసరించారన్న విషయం అప్పటిలో చాలామందికి అర్థం కాలేదు.

1922లో గాంధీజీని నిర్బంధించినది మొదలు 1929 వరకు ఏడు సంవత్సరాల పాటు స్వరాజ్య ఉద్యమం కొంత వరకు నీరసపడిందని చెప్పాలి. ఈ మధ్య కాలంలో దేశ నాయకులు తాము ఎవరికి తోచిన మార్గాన వారు నడుచుకుంటూ వచ్చారు. కొంతమంది స్వరాజ్య పార్టీ ఏర్పరచుకుని, ఎన్నికల ద్వారా శాసన సభలలో చేరి, అక్కడ బ్రిటిషు ప్రభుత్వపు పలుకుబడి తగ్గించడానికి, వారి గుట్టు బయటు పెట్టడానికి పాటు పడ్డారు. మరి కొంతమంది



దేశబంధు చిత్తరంజన్ దాసు

అజ్ఞాత విప్లవకారుల మార్గాన్ని అనుసరించారు. 1924 - 25 సంవత్సరంలో అజ్ఞాత విప్లవకారుల కార్యకలాపాలు ఎక్కువయాయి. పంజాబు నుంచి బెంగాలు దాకా సాయుధ విప్లవానికి ఏర్పాట్లు ప్రారంభించారు. తూర్పు బెంగాల్‌లో ఈ విప్లవకారుల నాయకుడుగా పేరుపడినవాడు సూర్యసేన్. ఇతని అనుచరవర్గం బాంబులు తయారుచేసే కార్యక్రమం దీక్షగా తలపెట్టారు. ఇందుకోసం డబ్బు కావలసి వస్తే పెద్ద పెద్ద బందిపోటులు నిర్వహించి సంపాదించుకునేవారు. ఈ దళంవారు ఎందరినో ఆంగ్లేయ ఉద్యోగులను హతమార్చారు కూడా! ఈ రోజులలోనే గోపీనాథ్ సాహా అనే విప్లవకారుణ్ణి ఒక ఆంగ్లేయుని చంపిన నేరానికి ఉరితీశారు.

యు.పి., బీహార్, ఢిల్లీలలో కూడా 1924 - 25 సంవత్సరంలో విప్లవ కారుల ఉద్యమం వేడి అందుకుంది. 1925 ఆగస్టులో రాంప్రసాద్ బిస్మిల్ నాయకత్వం క్రింద ఒక విప్లవ సంఘం లక్నో దగ్గర నడుస్తూన్న రైలుబండీలో

విప్లవకారుల్ని ఉరితీయుట



బందిపోటు చేసి ప్రభుత్వ ధనం లూటీ చేశారు. ఈ బందిపోటులో పాల్గొన్న విప్లవకారులందరూ బహుశా పట్టుబడిపోయారు. దీనిని గురించి జరిగిన విచారణ 'కాకోరీ కుట్ర కేసు' అని ప్రసిద్ధి చెందింది. రాంప్రసాద్ బిస్మిల్‌నూ అష్ఫాక్ ఉల్లాను మరికొందరు విప్లవకారులను ఉరితీశారు; కొందరికి దీర్ఘకాలం కారా గారవాస శిక్ష విధించారు.

గాంధీజీ చెరసాల నుండి విడుదల అయి వచ్చేసరికి దేశంలో పరిస్థితి ఈ విధంగా ఉంది. ఇంకొక విషయం గురించి కూడా గాంధీజీ మనస్సు బాధ పడింది. కొందరు ముసల్మానులు కాంగ్రెస్ నుంచి క్రమంగా దూరం అవుతున్నట్లు ఆయనకు తెలిసింది. సహాయనిరాకరణోద్యమం నిలిపివేశాక టర్కీలో ప్రజా విప్లవం సంభవించి, విప్లవనాయకుడు ముస్తఫా కమాల్ పాషా దేశాధిపతి అయి, ఖలీఫాకు ఉన్న కాస్త అధికారాలనూ హస్తగతం చేసుకున్నాడు. అటు తరువాత మన దేశంలోని ముసల్మానులకు ఖిలాఫత్ ఉద్యమం నిష్ప్ర యోజనం అనిపించింది.

అప్పటినుంచి, బ్రిటిషువారు ఇక్కడి మహమ్మదీయులను - దేశానికి స్వరాజ్యం వస్తే హిందువుల రాజ్యం ఏర్పడి, ముసల్మానులను పీకిస్తారని భయపెట్టడం మొదలుపెట్టారు. మెల్లి మెల్లిగా, మొదట కాంగ్రెస్‌తో సహకరించిన ముసల్మాను నాయకులెందరో కాంగ్రెస్ నుంచి తొలగిపోవ నారంభించారు - వారిలో ప్రముఖులు జిన్నాసాహెబ్ మాత్రమే కాదు, మహమ్మదలీ, షౌకతలీలు కూడా ఉన్నారు.

ప్రజానీకంలో కూడా చిన్న చిన్న విషయాలను గురించి హిందూ ముస్లిముల మధ్య జగడాలు వస్తూండేవి. కొన్నిసార్లు మితిమీరిన రక్తపాతం కూడా జరిగేది. గాంధీజీ చెరసాల నుంచి విముక్తుడయి వచ్చాకనే దేశంలో కొన్ని ప్రాంతాలలో పెద్ద పెద్ద కొట్లాటలు జరిగాయి. గాంధీజీ ఇటువంటి సంఘటనలు జరుగుతాయని ఎన్నడూ ఊహించనైనా లేదు. విదేశీయులతో పోరాటానికి తగిన ఆయుధాన్ని కనిపెట్టాం సరే - మరి, సోదరులకు సోదరులకు నడుమ జరిగే పోరాటాన్ని ఆపడం ఎలాగ?

# సైమన్ కమిషన్

మనస్సులో చాలా బాధపడి, గాంధీజీ 21 రోజులు నిరాహారదీక్ష వహిస్తు న్నానని ప్రకటించారు. పూర్వం తన ఆప్తమిత్రుడై ప్రస్తుతం తననుంచి దూరమైపోయిన మౌలానా మహమ్మదలీ ఇంటిలో బసచేసి గాంధీజీ ఉపవాసం ప్రారంభించారు. వెనకటి సుస్తీ తరువాత గాంధీజీ ఆరోగ్యం బాగా దిగజారింది.

ఇంత దీర్ఘమైన ఉపవాసం చేశాక ఆయన బతక గలడనే ఆశ ఎవరికీ లేక పోయింది. కొద్ది రోజులపాటు హిందూ ముస్లిముల మధ్య సోదరభావం కన బడింది. హిందువులూ ముస్లిములూ ఆయన ఆయుర్దాయం గట్టిగా ఉండాలని దేవాలయాలలోను, మసీదులలోను ప్రార్థనలు చేశారు. అన్ని సంప్రదాయాలకు చెందిన నాయకులూ గాంధీజీ చెంతచేరి, అన్ని సంప్రదాయాలవారూ దేశంలో శాంతిగా ఉంటామని ఒక ఒప్పందాన్ని తయారు చేసుకున్నారు.

దేశ సౌభాగ్యం కొద్దీ గాంధీజీ బతికి బయటపడ్డారు; దేశ వ్యాప్తమైన సత్యాగ్రహం ఏ విధంగా మొదలుపెట్టగలమా అని దాన్ని గురించిన ప్రయత్నాలలో నిమగ్నులయారు. గ్రామ గ్రామంలో ప్రజలను కూడగట్టుకు వచ్చే పథకాన్ని ఒకదాన్ని ఏర్పాటుచేసి, తద్వారా కార్యకర్తలందరూ దేశంలో అన్ని మూలలకూ పోయి, గాంధీజీ సందేశాన్ని ఎరుకపరచి, ప్రజలకు దారి చూపేటట్లు చేయడం అన్నింటి కన్నా ముఖ్యం! ఈ దృష్టిని అనుసరించి, ఆయన రెండు కార్యక్రమా లను నిర్దేశించారు. ఒకటి హరిజనోద్ధరణము, రెండవది చరఖా, ఖద్దరు ప్రచా రము. ఈ రెండు కార్యక్రమాలకోసం ఆయన రెండు సంస్థలను నెలకొల్పారు. వాటిని కొనసాగించడంకోసం ధనం సేకరించ నారంభించారు. 1928, 29 సంవ త్సరాలలో ఆయన దేశం అంతటా పర్యటించారు. దేశ స్వాతంత్ర్యం కావల సినవారు ఆయన దృష్టిలో పేదవారే, కనుక, వారి విశ్వాసాన్ని సంపాదించ డానికి తాను పేదవానికి వలెనే ఆయన తన పర్యటనతో రైలుబండిలో మూడవ తరగతిలోనే ప్రయాణం చేసేవారు. ఆయన తన వెనుక వచ్చే అనుచరులు కూడా ఆ విధంగా చెయ్యాలని సలహా యిచ్చారు. అనేక ప్రాంతాలలో ఆయన హరిజనులకు ఉన్నత కులాలు అనబడేవారికి నడుమ వ్యత్యాసాలను లేకుండా పనిచేసే కార్యకర్తల ఆశ్రమాలను నెలకొల్పారు. ప్రతి గ్రామంలోను చరఖా సంఘపు శాఖలను తెరచి, చదువను వ్రాయను తెలిసిన యువకులకు స్వేచ్ఛాను సారము క్రమశిక్షణ తప్పకుండా నిరాడంబరంగా జీవించే మార్గం ఏర్పరచారు. గ్రామాలలోని స్త్రీలకు నూలు వడికే చరఖాలనిచ్చి, వారు ఇంటిలో ఉండే కొంచెం సొమ్ము చేసుకునే సదుపాయం కల్పించారు.

ఆ తరువాత 1930, 1932 సంవత్సరాలలో పెద్ద యెత్తున సత్యాగ్రహో ద్యమం కొనసాగినపుడు ఈ ఆశ్రమాల కార్యకర్తల ద్వారా ఎంతో సహకారం లభించింది. కరపత్రాలు రహస్యంగా అచ్చువేయించి, కార్యకర్తల సాహాయ్యంతో వాటిని ప్రతి గ్రామానికి చేరవేసేవారు.

ఈ యేడు సంవత్సరాలలోను చిన్న చిన్న సమస్యలపైని ఆయా చోట్ల సత్యాగ్రహోయుధానికి వినియోగించే అవకాశాలు కలిగేయి. కొన్నిచోట్ల కొంచెం గాను, కొన్నిచోట్ల అధికంగాను జయం లభించింది.

1928 లో కొంచెం చెప్పుకొనదగ్గ పెద్ద విషయాలే జరిగాయి. ఢిల్లీలోని

కేంద్ర అసెంబ్లీలోను, రాష్ట్రాలలోని శాసన సభలలోను ప్రజా ప్రతినిధులకు మరి కొన్ని అధికారాలు ఇస్తేనేగాని పని జరగదని బ్రిటిషువారికి తోచింది. మితవాద నాయకులు కూడా ఎక్కువ అధికారాలిమ్మని అడుగుతూ వచ్చారు. 'అన్ని వర్గాల వారు కలిసి మీ కోర్కెలివి అని తెలుపలేదు గనుక మీ కోర్కెలను మేం పాటించము' అని బ్రిటిషు ప్రభుత్వం అనేటందుకు అవకాశం ఇయ్యకుండా, మితవాద వర్గంవారు, కాంగ్రెసువారు కలిసి ఒక విధానం తయారుచేశారు. మోతీలాల్ నెహ్రూ అధ్యక్షతను ఈ పనికై ఒక సమితి ఏర్పడి, ఒక విధానాన్ని సిద్ధం చేశారు. కొందరు ముసల్మాను నాయకులు, కొద్దిమంది యితరులు మిగిలిన అన్ని వర్గాలవారు ఆ విధానాన్ని ధ్రువపరిచారు.

అయితే బ్రిటిషు ప్రభుత్వం అంతకు ముందుగానే సర్ జాన్ సైమన్ నాయకత్వం క్రింద మన దేశానికి ఒక ఉపసంఘాన్ని పంపారు. దీనినే సైమన్ కమిషన్ అన్నారు. ఈ కమిషన్‌ను వ్యతిరేకిస్తూ దేశం అంతటా బ్రహ్మాండమైన హర్తాల్ చేశారు. కమిషన్ వెళ్లిన చోటల్లా నల్ల జండా ప్రదర్శనలు జరిగాయి. వారితో మాటాడడానికి ప్రజల ప్రతినిధు లెవ్వరూ ముందుకు రాలేదు. ఈ ప్రదర్శనల్లో భారతదేశపు యువకులూ విద్యార్థులూ గొప్ప ఉత్సాహంగా పని చేశారు. అవమానంగా భావించిన ప్రభుత్వం ప్రదర్శకులపైని లాఠీలూ, కొన్ని చోట్ల తుపాకులూ కూడా ప్రయోగించారు. లక్నోలో జవాహర్‌లాల్ నెహ్రూ, గోవింద వల్లభ పంతుగారలకు ఈ దెబ్బలు తగిలాయి. లాహోరులో పంజాబ్ సింహం లాలా లజపత్‌రాయ్‌కి ఈ దెబ్బలు తగిలి కొన్ని రోజులలోనే మృత్యువు వాత పడ్డాడు. దీనికి ప్రతీకారం చేద్దామనే, తరువాత పేరుకెక్కిన భగత్‌సింగ్ అనే విప్లవకారుడు లాలా లజపత్‌రాయ్ పైని లాఠీ ఛార్జి చేసిన తెల్ల పోలీసు ఉద్యోగిపైని తుపాకి పేల్చి, పరారి అయిపోయాడు.

1925 కు తరువాత రెండు, రెండున్నర సంవత్సరాల వరకు విప్లవకారుల కార్యకలాపాలు పైపైని నీరసపడ్డాయి గాని లోపల లోపల బలపడే ఏర్పాట్లు జరుగుతూ వచ్చాయి. ఉత్తర భారతంలో విప్లవకారుల నాయకుడు చంద్రశేఖర ఆజాద్. ఈ యువకుడే 1921 లో జరిగిన సహాయ నిరాకరణలో కొరడా దెబ్బలు తిన్నప్పుడు 'ఆజాద్'ని అని (స్వతంత్రుడిని అని) చెప్పుకున్నవాడు. కాకోరీ బందిపోటులో కూడా పాల్గొన్నాడు. అప్పటికే అతడు నవ యువక దళంలో చేరాడు కాని పట్టుబడిపోకుండా తప్పించుకున్నాడు. ఈ సారి అతడు దేశ వ్యాప్తమయిన విప్లవం జరపడానికిగాను సమకూర్చిన విద్రోహి దళంలో సాండర్స్ దొరను చంపడానికి సిద్ధమయిన విప్లవ వీరుడు భగత్‌సింగ్ కూడా చేరాడు. సాండర్స్ హత్య అయిన తరువాత పంజాబ్‌లోని నిర్దోషులైన ప్రజానీకం పైని ప్రభుత్వం యుక్తా యుక్తము లెరుగని దుండగాలు జరుపుతూంటే చూసే ప్రజల హృదయాలలో విప్లవోద్రేకం వెల్లువికేటట్లు చెయ్యడానికి

గాను ఒక సాహస కృత్యం చెయ్య సంకల్పించారు. అటువంటి త్యాగం చెయ్యడానికి ఇద్దరు వీర యువకులను భగత్‌సింగ్, బటుకేశ్వరదత్తులను ఎంపిక చేశారు. 1929 ఏప్రిల్ 8 వ తేదీని కొత్త ఢిల్లీలోని అసెంబ్లీ భవనంలో అభ్యాగతుల అనుమతి పత్రాలతో వారిద్దరు ప్రవేశించి, అభ్యాగతుల అరలో కూర్చున్నారు. వారిద్దరూ ఒకరి తర్వాత ఒకరు ఎవరికీ హాని చెయ్యకుండా చెవులు గళ్లు పడేటట్లు పేలే రెండు బాంబులు ప్రేల్చారు. ఆపైని రివాల్వరుతో గాలిలోకి ప్రేల్చి, విప్లవ కరపత్రాలను అసెంబ్లీలోకి విసిరారు. ఆ తర్వాత ఆ వీరులిద్దరూ తమంత తాము పోలీసులకు లొంగిపోయారు. దేశం అంతటా ఈ సంఘటన ప్రబల సంచలనం కలిగించింది. దానితో, దేశ ప్రజలందరికీ విప్లవకారులపట్ల ప్రత్యేక శ్రద్ధాభక్తులు పెరిగాయి. కొంతకాలం అయాక లాహోరులోను, సహారన్‌పూర్‌లోను బాంబులు తయారుచేసే పెద్ద పెద్ద కార్ఖానాలు పోలీసుల కంటపడ్డాయి. ముందు పట్టుబడిన కొందరు వ్యక్తులు ఈ రహస్య విప్లవ చర్యల గుట్టుమట్టులన్నీ పూర్తిగా పోలీసులకు చెప్పివేశారు. ఇంకేమవుతుంది? – ఒక్కొక్క వ్యక్తికోసం వెతికి వెతికి పట్టుకోవడం; లాహోరు కుట్ర కేసు అను పేర వారిపై విచారణ జరుగుతూ వచ్చింది.

చివరికి విసుగువచ్చి ఖైదీలు నిరాహార దీక్షపూని దాదాపు రెండు నెలలవరకు ఆ దీక్ష కొనసాగించారు. దేశ ప్రజలందరికీ విప్లవకారులపై ఆదరభావం హెచ్చి, ప్రభుత్వంపై క్రోధం పెరిగింది – వారు ఖైదీలపైని – ఎన్నో నియమాలను విధించారు. కాని, జతీన్ దాస్ అనే ఖైదీ ఇంకా తన నిరాహార దీక్ష వదలడానికి నిరాకరిం



భగత్ సింగ్

దాడు. 64 రోజుల ఉపవాసం చేసి, అతడు మృత్యువు వాత పడినాడు. దేశంలో వాతావరణం మరింత వేడెక్కిపోయింది.

ఒకపక్క కుట్రదారుల రహస్య కార్యకలాపాలు వేగం పుంజుకున్నాయి. మరొక ప్రక్క కాంగ్రెసు లోపలా వెలుపలా నవయువకులకు విప్లవ కృత్యాల వైపు శ్రద్ధ పెరుగుతూ వచ్చింది. జవాహర్‌లాల్ నెహ్రూ, సుభాష్‌చంద్రబోసూ ఈ లోపల చాలినన్ని రోజులు యూరప్‌లో గడిపి, భారతదేశం తిరిగి వచ్చారు. రష్యా ప్రజలు విప్లవం కొనసాగించి (నిరంకుశ) జార్ చక్రవర్తుల పరిపాలన త్రోసి రాజని కర్షక కార్మిక వర్గాల పరిపాలనను ఏర్పరచుకున్నారు. ధనవంతులకు పేదవారికీ నడుమ వ్యత్యాసం పూర్తిగా తొలగిపోయేటట్లుగా అంతకు ముందేదేశమూ సాధించని ప్రగతిపూర్వక వ్యవస్థను నెలకొల్పుకున్నారు. జవాహర్‌లాల్ నెహ్రూ, సుభాషచంద్రబోసులు ఆ విప్లవం వల్ల పూర్తిగా ప్రభావితులై వచ్చారు. దేశంలోని నవయువకులు ఈ నాయకులవైపు ఆకర్షితులై ఏదో సాధించి తీరాలనే ఉత్కంఠతో ఊగులాడారు.

1928 లో కలకత్తాలో జరిగిన కాంగ్రెస్‌లో అన్ని వర్గాలకు చెందినవారూ సమకూడి రాజ్యాంగ సంస్కరణల ప్రణాళిక నొకదానిని సిద్ధపరిచారు. ఆ కాంగ్రెస్‌కు అధ్యక్షులు మోతీలాల్ నెహ్రూ. ఈ ప్రణాళిక ఆయన అధ్యక్షత క్రిందనే తయారయింది. అయితే, ఆయన కుమారుడు జవాహర్‌లాల్ నెహ్రూ, యువనాయకుడు సుభాష్ చంద్రబోసూ ఈ ప్రణాళికను ఒప్పుకోలేదు. సంపూర్ణ



బటుకేశ్వర దత్తు

స్వరాజ్యానికి ఏమాత్రం తక్కువయినా యువనాయకులు అంగీకరించడానికి వీలు లేదన్నారు. ఎందుకంటే, ఆ ప్రణాళికలో సూచించిన ప్రకారం ప్రజా ప్రతినిధులు బ్రిటిషు ప్రభుత్వానికి లోబడి ఉంటూ శాసనాలు చెయ్యవలసి ఉంది. చివరికి గాంధీజీ ఒక ఒప్పందం కుదిర్చారు. దాని ప్రకారం ఈ ప్రణాళికను బ్రిటిషువారు ఒక యేడాదిలోగా అమలుపరచక పోయినట్లయితే, కాంగ్రెసు పూర్ణ స్వరాజ్యం పొందడానికి తన శక్తినంతా వినియోగిస్తుంది.

# పూర్ణ స్వరాజ్య ప్రతిజ్ఞ, ఉప్పు సత్యాగ్రహము

1930 జనవరి 26 వ తేదీ మన దేశ చరిత్రలో మరువరాని రోజు. ఎందుకంటే, ఆ రోజున మన దేశంలోని ప్రతి చిన్న బస్తీలో, ప్రతి పెద్ద పట్టణంలో మన దేశీయులు సభలు జరిపి, భారతదేశానికి సంపూర్ణ స్వరాజ్యం సంపాదిస్తామని ప్రతిజ్ఞ చేశారు. (అందుచేతనే మన దేశాన్ని ప్రజాస్వామిక గణరాజ్యంగా ప్రకటించిన తేదీ జనవరి 26) సత్యాగ్రహ సమరపు సర్వకార్యభారమూ కాంగ్రెసువారు గాంధీజీకి అప్పగించి, ఆయనను ప్రధానసేనానిగా నియమించు కున్నారు. ఈ సమరానికి ఏ విధంగా నాయకత్వం వహించి నడిపించేదీ నిర్ణయించే బాధ్యత ఆయనకే వదిలివేశారు.

గాంధీజీ ఉప్పు చట్టాన్ని ఉల్లంఘించాలని నిర్ణయించారు. ప్రజల కెందరికో ఉప్పు చట్టమును గురించి కొంచెంకూడా తెలియదు. ఉప్పు చట్టాన్ని ఉల్లంఘిస్తే ఏమవుతుంది? చాలామందికి ఇదే శంక పట్టుకుంది. పెద్ద పెద్ద చట్టాలను ధిక్కరిద్దామనుకున్న వారికి చాలా నిరుత్సాహం కలిగింది. అయితే ఉప్పు సత్యాగ్రహ పోరాటం కాగానే దేశంఅంతా అవురా అని ముక్కు మీద వేలు వేసుకుంది. గాంధీజీ పేదవారి నిత్యజీతానికి చెందిన చిన్న అలవాటులలో నుంచి ఒకదానిని తన తొలి ప్రయోగానికి సామగ్రిగా స్వీకరించదలిచారు. ముతక ధాన్యంతో చేసిన ఎండు రొట్టెల్లో గాని, ముతకబియ్యంతో చేసిన అన్నంలో గాని, వేలకొద్దీ సామాన్య జనం పప్పూ కూరా అనకుండా వారు కష్టపడి సమకూర్చుకున్న ఉప్పు మాత్రం కలుపుకోగలుగుతున్నారు - మన దేశంలో విస్తృతంగా వ్యాపించిన పేదతనం మూలాన. భారతదేశపు సముద్రతీరపు నిడివి సామాన్యమైనది మాత్రం కాదు. సముద్రపు ఒడ్డున ఉప్పు దానంతటదే ఏర్పడుతోంది. చంద్రుడు ఉదయించి, ఆకాశంపైని లేచినకొద్దీ సముద్రంలోని నీరు కూడా పైపైకి పొంగు తుంది. పూర్ణిమ రోజున నెలకంతటికీ ఎక్కువ ఎత్తుకి పొంగుతుంది. ఆ నీరు సముద్రపు ఒడ్డును దాటి చాలా దూరం గట్టున పారి, ఆ గట్టున ఉండే చిన్నా పెద్దా గుంటలన్నీ ఆ నీటితో నిండుతాయి. కృష్ణపక్షంలో చంద్రబింబంలోని

కళలతోపాటు సముద్రజలం కూడా దిగజారిపోతుంది. ఆ సమయంలో గుంటలలో నిండిన నీరు, క్రమంగా ఇంకి, ఎండిపోతుంది. కొద్ది రోజులలోనే ఆ గుంటలలో తెల్లని మృదువైన ఉప్పు తేరుకుంటుంది.

ప్రతి సముద్ర తీరానా ఉండే గ్రామాలన్నిటిలోనూ కాపురం ఉండే జనుల యెట్టయెదుట ఉప్పు నదులలో మంచినీళ్లలాగా కొల్లలుగా దొరుకుతుంది. నదుల లోని నీరుగాని, నూతులలోని నీరుగాని తమ కుండల్లో నింపుకు తీసుకుపోవడానికి ఎవరి నిషేధమూ అడ్డురాదు, మరి, ఎట్టఎదుట పండే ఉప్పును ఎత్తి తీసుకోవడం చట్టం ప్రకారం నేరంగా పరిగణిస్తుంది ప్రభుత్వం. సహజంగా పండే ఈ ఉప్పంతా ఈ విధంగా నాశమైపోతోంది.

సముద్రతీరంలో అక్కడక్కడ ఉప్పు నిలవచేసే ప్రభుత్వం వారి గోదాములు ఉండినమాట వాస్తవమే. ఆ ఉప్పును బజారులో అమ్మకానికి తెస్తున్నారు. మన దేశంలో అమ్మే ఉప్పులో చాలామట్టుకు ఇంగ్లాండ్ నుంచే వస్తోంది. దీనికి కారణం ఏమిటంటే, అంగ్లేయులు తమ ఓడలలో మన దేశంనుంచి ధాన్యం, పత్తి వంటి ముడి పదార్థాలను తీసుకుపోయేవారు. వాటిని తిరిగి వెనక్కి తీసుకువస్తే సరుకు బాగా తక్కువగా ఉండేది. ఇంగ్లాండ్‌లోని యంత్రాగారాలలో తయారైన సామగ్రులను మన దేశం అమ్మడానికి తెస్తే వాటి ధర హెచ్చుగా చెప్పేవారు. అయితే తూకంలోను పరిమాణంలోను బొత్తిగా తక్కువే. ఆ ఓడలలో తక్కువ పరి మాణపు సామాన్లతో ఓడ కదలడం కష్టం. మరో బరువైన వస్తువేదైనా ఓడ లోతట్టును నింపవలసివచ్చేది. ఈ పని ఇంగ్లాండ్‌లో అదనంగా మిగిలిపోయిన ఉప్పుతో భర్తీ చేసేవారు. ఈ విధంగా, ఈ దేశంలో ఉచితంగా లభించే ఉప్పుకి బదులు, పెద్ద వెలయిచ్చి ఇంగ్లాండు దేశపు ఉప్పు కొనుక్కుంటూండే వారు మన వారు. సముద్రానికి దూరంగా ఉండే వారికోసం చవిటి మట్టినుంచి ఉప్పు తయారు చేసి తీసుకుపోయే గ్రామ ప్రజలను ప్రభుత్వంవారు దారిలో అటకాయించేవారు.

గాంధీజీ ఒక సత్యాగ్రహుల బృందంతో కలిసి కాలినడకను సముద్రతీరం చేరుకుని, ఈ ఉప్పు చట్టాన్ని ఉల్లంఘిస్తానని నిశ్చయించుకున్నారు. ఈ కార్యక్రమానికై ఆయన గుజరాత్‌లోని సూరత్ జిల్లాకు చెందిన దాండీ అనే గ్రామాన్ని ఎంపిక చేసుకున్నారు. అక్కడికి చేరుకోవడానికి దాదాపు 200 మైళ్లు నడవాలి. దీనికి పాతిక రోజులు పడుతుంది; రోజూ ప్రొద్దుటా, సాయం త్రమూ కలిసి 7, 8 మైళ్లు నడవలసి ఉంటుంది.

గాంధీజీ బృందంలో ఆయనతో కలిసి మొత్తం 79 మంది సత్యాగ్రహులు. 1930 మార్చి 12 వ తేదీని చరిత్రాత్మకమైన దాండీ యాత్ర ప్రారంభమయింది. సాబర్మతీ సత్యాగ్రహాశ్రమానికి ఎదుటి బాటపైని ముందటి రాత్రి నుంచీ వేల కొలది స్త్రీ పురుషులు చేరుకుని మజిలీ చేశారు. ప్రొద్దుట యాత్ర ప్రారంభమయే సరికి, సాబర్మతీ ఆశ్రమం నుంచి అహమ్మదాబాద్ పట్టణం వరకు పోయే



మార్గంలో సాబర్మతీనది వంతెనపైని, ఎక్కడ చూస్తే అక్కడ నరనారీ జనం గుంపులు గుంపులుగా చేరుకుంది. మార్గం పొడుగునా మాత్రమే కాదు. ఈ ప్రక్కా ఆ ప్రక్కా ఉండే పొలాలు, చెట్లు, మేడలు, అన్నీ జనసముదాయంతో నిండిపోయాయి.

దారిలో తగిలే ప్రతి గ్రామంలోను గుంపులుగా జనం ఎదురయి గాంధీజీకి స్వాగతం చెప్పారు. స్త్రీలు ఆయనకు హారతులిచ్చి, నుదుట బొట్టు పెట్టి పూల మాలలు వేసేవారు. పగటి భోజనంచేసి కొన్ని గంటలు విశ్రాంతి ఏర్పాట్లు కొన్ని ఊళ్లలోను, కొన్ని చోట్ల రాత్రి భోజనమూ పడకా ఏర్పాట్లు చేసికొంటూ, అక్కడి జనంతో గాంధీజీ సంభాషణలు జరుపుతూ గ్రామ సభలలో ఉపన్యసిస్తూ గడిపారు. పాతిక రోజులలో ఈ యాత్ర గుజరాత్‌లో మాత్రమే కాదు, దేశం అంతటా మునుపెన్నడూ రాని చైతన్యం కలిగించింది.

ఏప్రిల్ 5 వ తేదీ నాటికి యాత్రాబృందం సముద్రతీరాన ఉన్న దాండీ గ్రామం చేరుకుంది. ఆ మర్నాడు ఏప్రిల్ 6 వ తేదీయే 11 ఏళ్ల నుంచి యేటేటా సత్యాగ్రహ దివసంగా పాటిస్తూ వచ్చారు. ఆ రోజున గాంధీజీ తన సహచరులందరితోను కలిసి సముద్రస్నానం చేశారు. తర్వాత సముద్రతీరాన గల ఒక గుంటలోని ఉప్పునీటిని ఒక పాత్రలోకి పట్టారు. కొన్ని కొన్ని గుంటల్లో చేరుకున్న నీటి ద్వారా తయారైన ఉప్పుకూడా ఎత్తుకున్నారు. పాత్రలో పట్టిన నీటిని పొయ్యి మీద పెట్టి ఉప్పు తయారు చేశారు - అది దావాపు అర తులం వచ్చింది. సాయంత్రం దాండీ తీరాన జరిపిన సభలో తాము తయారు చేసిన అమూల్యమైన ఉప్పు అచ్చు వేలాం వేశారు. అహమ్మదాబాదుకు చెందిన ఒక శేఠ్ ఆ అర తులం ఉప్పు అచ్చు 525 రూపాయలకు కొనుక్కున్నాడు. దేశం అంతా ఊపిరాపేసి గాంధీజీ అంటే సమ్మోహితులైనట్లు అయిపోయారు. ఉప్పు చట్టాన్ని ధిక్కరిస్తూ దేశ ప్రజలంతా సత్యాగ్రహం చేసే స్వేచ్ఛ ఆయన ద్వారా లభించింది. వేలకొలది స్త్రీ పురుషులు ఉప్పు చట్టాన్ని ధిక్కరించారు. ప్రతి చోటా జనం అరెస్టు అవుతూ వచ్చారు. పోలీసులు నానా రకాల హింసాకాండ ఆరంభించారు.



సాబర్మతీ ఆశ్రమం

దేశం అంతటా జనంతో చెరసాలలు నిండిపోయాయి; జనం ఎక్కువవు తున్న కొద్దీ వారిపై రకరకాల దౌర్జన్యాలు జరుగుతూ వచ్చాయి. అయితే ఇప్పుడు బ్రిటిషుపాలకులకి గాంధీజీని పట్టుకోవడానికి ధైర్యం చాలలేదు. ఆయన చివరికి మరొక కఠిన నిర్ణయం కూడా చేశారు. గుజరాత్‌లో ధరాసాణా అనే పేర ఒక ఉప్పు గోదాం ప్రభుత్వం వారి అధీనంలో ఉంది. దానిలోని ఉప్పు అవసరం వచ్చినప్పుడు సర్కారు రివాజులో బజారుకు పంపుతూ ఉండేవారు. గాంధీజీ



తాను తన సహచరులూ కలసి ఆ గోదాం ఎక్కి అందులోని ఉప్పు ఎత్తుకు వస్తా మని ప్రకటించారు.

ఈ నిర్ణయం ఎదురైతే ప్రభుత్వం చివరికి గత్యంతరం లేని పరిస్థితిలో పడక తప్పదు. అయితే ఈ దాడికి ముందుగానే గాంధీజీని చెరసాలలో పెట్టారు.

గాంధీజీ తరువాత, వయోవృద్ధుడైన అబ్బాస్ తయాబ్జీ ఈ సత్యాగ్రహ బృందా నికి సేనాధిపతిత్వం నిర్వహించి తాను కూడా అరెస్టు అయారు; అప్పుడు సరోజినీ నాయుడు సేనాని అయింది.

సరోజినీ నాయుడు ఆంగ్లంలో ప్రసి ద్ధురాలయిన కవయిత్రి. ఆమె కవిత్వం చదివి మెచ్చినవారు ఇంగ్లాండ్‌లో కూడా ఉండేవారు. ఆమె గొప్ప విదుషీమణి, బాగా కలవారి కుటుంబంలో పుట్టింది.

చివరికి ఆమెకూడా అరెస్టు అయింది. ఆమె తర్వాత ఏడేడుగురు చొప్పున సత్యాగ్రహుల బృందాలు ఒకటి వెంట ఒకటిగా గోదాంపైని దాడి ప్రకటిస్తూ వచ్చారు. అశ్విక పోలీస్ దళం తమ గుర్రాలను వారిపై వదిలేవారు; లాఠీలు ప్రయోగించేవారు; సత్యాగ్రహుల తలలు పగిలాయి; రక్తసిక్తమైన శరీరాలతో వారిని చెరసాలలో నిర్బంధించారు.

## గాంధీ - అర్విన్ - ఒడంబడిక

ఆ సమయానికి దేశం అంతటా కూడా అదేమాదిరి ప్రజ్వలన సాగుతూ ఉంది. ఏ విదేశీ ప్రభుత్వమైనా తమ క్రింది బానిసదేశపు పౌరులపైని ఎంతటి తీవ్ర అత్యాచారాలను చెయ్యగలదో అన్నిటినీ జరిపించారు. దేశపు పెద్ద నాయకులందరూ జెయిళ్లలో నిర్బంధంలో ఉండిపోయారు, అయినా సత్యా

గ్రహుల సంఖ్య ఏమాత్రమూ తగ్గలేదు. ఉప్పు చట్టాన్ని ఉల్లంఘించడమే కాకుండా, విదేశీ వస్త్రాలమ్మే అంగడులవద్దా, కల్లు సారా దుకాణాలవద్దా పికెటింగూ, ధరనా చెయ్యడంకూడా ప్రారంభించారు. నవయువకుల హృదయాల్లో ఉద్యమోత్సాహానికి లోపంలేదు - పట్టణాలయినా సరే - గ్రామాలయినా సరే! వేలకొలది జనం జెయిళ్ళలో నిర్బంధితులయారు. వేలకొలది పౌరుల ఆస్తిపాస్తులను జప్తుచేశారు. వేనవేలు క్షతగాత్రులయారు. ఎన్ని వేల మందో ప్రాణాలు విడిచారు.

ఈసారి ఉద్యమంలో గొప్ప విషయం ఏమిటంటే, ఇందులో ఎందరో స్త్రీలుకూడా యథేచ్ఛగా పాల్గొన్నారు. గుజరాత్‌లో డాండీ యాత్రను స్వయంగా నడిపించి గాంధీజీ స్త్రీలలో కూడా పెద్ద యెత్తున ఉత్సాహం రేకెత్తించారు. అక్కడ చెరసాలలకు పోయిన స్త్రీల సంఖ్య కూడా ఎక్కువనే చెప్పాలి. దేశంలో ఇతర భాగాలలో కూడా స్త్రీ లోకంలో అపూర్వ చైతన్యం కనిపించింది. ఉత్తర భారతంలో అందులో ముఖ్యంగా ఉత్తరప్రదేశ్, బీహారులలో అప్పటికి స్త్రీలలో ఘోషా పద్ధతి ఎక్కువగా ఉండేది. అయినప్పటికీ, చదువనూ వ్రాయనూ తెలిసిన వారైతేయేం, అక్షరజ్ఞానం కూడా లేని వారైతేయేం లక్షలకొద్దీ స్త్రీలు అన్ని తరహాలవారూ ఘోషాను వదిలిపెట్టి, జాతీయ ఉద్యమంలోకి చేరిపోయారు. ఎందరు దెబ్బలు తిన్నారో, ఎందరు జైళ్ళకు వెళ్లారో!

వేసవి గడిచిపోయి వానాకాలం వచ్చింది; తరవాత శీతాకాలం వచ్చింది. కాని, పోరాటపు తీవ్రత ఏమీ తగ్గేటట్లు కనబడలేదు. పైగా, గుజరాత్‌లోని బార్డోలీ తాలూకాలోనూ, ఖేడా జిల్లాలోను రైతులు మంచి పట్టుదలతో పన్నులు నిరాకరించే ఉద్యమం ప్రారంభించారు. ఉత్తరప్రదేశ్‌లోనూ, మరికొన్ని ఇతర ప్రాంతాలలోనూ కూడా పన్నుల నిరాకరణోద్యమానికి ఏర్పాట్లు జరుగుతూ వచ్చాయి.

చివరికి బ్రిటిషు ప్రభుత్వం కలవరపడింది. మరుసటి సంవత్సరం మొదటిలో జనవరిమాసపు చివర రాజీ సంప్రతింపుల కోసం కాంగ్రెసుకు చెందిన పెద్ద నాయకులందరినీ విడుదల చేశారు వైస్‌రాయ్ అర్విన్ ప్రభువు.

కాంగ్రెసుకు చెందిన పెద్ద నాయకులందరినీ విడుదల చేసి, వైస్‌రాయ్ అర్విన్ ప్రభువు గాంధీజీతో సంభాషణలు జరిపారు. ఈ సంప్రతింపులు కొన్నాళ్ళ వరకు సాగుతూ వచ్చాయి. చివరికి 1931 మార్చి నెలలో "గాంధీ అర్విన్ ఒడంబడిక" జరిగింది. చరిత్రలో తొలిసారిగా బ్రిటిషు ప్రభుత్వం దేశంలోని విద్రోహ నాయకులతో సమాన ఫాయాకు దిగి ఒక విరామ సంధిని చేసుకోవలసి వచ్చింది - ఇది అన్ని విధాలా దేశాల మధ్య జరిగే యుద్ధాలను ఆపుచెయ్యడానికి చేసుకొనే సంధిలాటిదే. రెండు పక్షాలూ పాటించదగు కొన్ని నిర్ణయాలు జరిగాయి. ఆంగ్ల ప్రభుత్వాధికారులతో లండన్‌లో ఏర్పాటు అయే రౌండ్‌టేబిల్ సమావేశంలో



రౌండ్ టేబిల్ సమావేశం

పాల్గొనడానికి ప్రతినిధులను పంపడానికీ, అంతవరకూ సత్యాగ్రహ సమరం ఆపుచెయ్యడానికీ కాంగ్రెసువారు ఒప్పుకున్నారు. ప్రభుత్వంవారు జెయిళ్లలోని నాయకులందరినీ విడుదల చేసి, ప్రజలు నిరాటంకముగా తమ వినియోగం కోసం సముద్రపు ఒడ్డున ఉప్పు తయారు చేసికోవచ్చని కూడా ప్రకటించారు.

అప్పుడు ఇంగ్లాండ్‌లోను, భారతదేశంలోను ఉండే ఆంగ్లేయులలో రెండు తరహాల వారుండేవారు. ఒక తరహావారు గాంధీజీ సత్యాగ్రహోద్యమపు సాఫల్యాన్ని గమనించి హిందూదేశానికి స్వాతంత్ర్యం ఇచ్చి తీరాలని యెంచే వారు. ఇంకో తరహావారు భారతదేశాన్ని ఇనపపాదంతో అణచిపెట్టి భయపెట్టి దీర్ఘకాలం తమ ఆధీనంలో ఉంచుకోవాలని ఇప్పటికీ ఉవ్విళ్లూరుతూ ఉండేవారు. అర్విన్‌ప్రభువు పదవీకాలం గడువు పూర్తికావచ్చి, ఇంక విలింగ్టన్ ప్రభువు కొత్త వైస్‌రాయ్‌గా వస్తాడనగా, ఈ గాంధీ అర్విన్ ఒడంబడిక జరిగింది. ఈ కొత్త వైస్‌రాయ్ అప్పటి బ్రిటిషు పార్లమెంటులోని ప్రతి పక్షానికి చెందినవారు. ఈ

ఒడంబడిక అమలు జరగకుండా భగ్నం కావలసిన ప్రయత్నాలన్నీ ఈ కొత్త వైస్రాయీ, ఆయన సలహాదారులయిన బ్రిటిషు ఉద్యోగుల హయాములో జరిగాయి. వారు ఏవేవో నెపాలు, కారణాలు వెతికి, భారతీయుల కోపాన్ని రెచ్చ గొట్టడానికి ప్రయత్నిస్తూండడంతో కాంగ్రెసువారు లండనులోని రౌండ్ టేబిల్ సమావేశంలో పాల్గొనాలన్న సంకల్పాన్ని వదులుకున్నారు. లాహోరు కుట్ర కేసులో పట్టుబడిన సర్దార్ భగత్ సింగ్ మొదలయిన వారికి ఆంగ్లేయ న్యాయాధి పతులు ఉరిశిక్ష విధించారు. దాని మూలంగా దేశంలో క్రోధం సుడిగాలిలా హెచ్చిపోతుందని గాంధీజీ లక్ష విధాల నచ్చజెప్పడానికి పూనుకున్నా కూడా ఆ విప్లవవాదులను ఉరితీసేశారు.

భారతీయులకు స్వాతంత్ర్యం రాకుండా ఆ త్రోవలో ఎన్నో ఆటంకాలను కలిగించ గోరేవారు. ఆనాటి బ్రిటిషు ప్రభుత్వంలో ఎందరో ఉన్నారు. రౌండ్ టేబిల్ సమావేశానికి ఆహ్వానాలు కూడా బ్రిటిషు పరిపాలనకు సహాయపడే వారికే ఎక్కువ మందికి పంపారు. అంతేకాకుండా, బ్రిటిషు ప్రభుత్వం భారతీయులలో వేరు వేరు మతవర్గాల ప్రజలకు వేరు వేరు ప్రతినిధులను పిలిచారు - క్రైస్తవులు, సిక్కులు, ముసల్మానులు, మాత్రమేకాక, హిందువులలోని అంటరాని వర్గాలకు కూడా ప్రతినిధులను ఎంచి, ఆహ్వానించారు. వీరిలో కాంగ్రెసువారు ప్రభుత్వ దృష్టిలో హిందువులలోని అగ్రవర్ణాలకు మాత్రమే ప్రతినిధులు.

ఇదంతా జరిగాక కాంగ్రెసువారు గాని గాంధీజీగాని లండను వెళ్లడం బొత్తిగా నిష్ప్రయోజనం అనిపించింది.

సెంట్రల్ జెయిల్ యరవడా



చివరికి బ్రిటిషు ప్రభుత్వం ఇంకా బిగిశారు. రౌండ్ టేబిల్ సభా ప్రతినిధులలో అధిక సంఖ్యాకులు సమ్మతి తెలిపినంత మాత్రాన ఏ విషయాన్నీ నిర్ణయం చేసి తీరాలని లేదని ప్రకటించారు. ప్రతి వర్గపు అభిప్రాయమూ తెలియాలని చెప్పి, బ్రిటిషువారు ప్రతి వర్గం వారినీ పిలిచారు. అప్పుడు కాంగ్రెస్‌వారు గాంధీజీ ఒక్కరే తమ ఏకైక ప్రతినిధి అని నిశ్చయించుకున్నారు. అయితే రౌండ్ టేబిల్ సభ పూర్తిగా విఫలం అయింది; భారతదేశానికి తిరిగి వస్తూండగానే గాంధీజీని బొంబాయిలో నిర్బంధించారు; ఆ వెనువెంటనే దేశంలోని నాయకులందరినీ నిర్బంధించారు.

జనం జెయిళ్లనుంచి విడుదల పొంది, ఒక యేడాది గడిచీ గడవకుండానే, తిరిగి వేలకొలది రంగంలోకి ఉరికేవారు; ముందు పొందిన కష్టాలన్నీ మరిచి, వారు తిరిగి జెయిళ్లకు సిద్ధం అయేవారు.

## రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రి వర్గాలూ, రెండవ పోరాటమూ

ప్రభుత్వం తిరిగి అటువంటి దురాగతాలే జరపడంతో ప్రజలు వాటిని త్యాగ శీలంతో సహనంతో ఎదుర్కొనేవారు. మళ్లీ దేశంలోని జాతీయోద్యమ సంస్థల ఆస్తులను జప్తుచేశారు. మళ్లీ కాంగ్రెసు కమిటీలను అన్నిటినీ చట్ట విరుద్ధములుగా ప్రకటించారు. అంతేకాక, జాతీయోద్యమ పత్రికలపై పెద్ద పెద్ద మొత్తాలు జుల్మానాలు విధించి, కట్టకపోతే, వాటిని మూయించివేశారు. దేశభక్తులయిన ముద్రాలయ యజమానులు కాంగ్రెసు కార్యక్రమాలను రహస్యంగా అచ్చువేసి, చరఖా సంఘాలకూ, హరిజనోద్ధరణాశ్రమాలకూ గ్రామ గ్రామానా గడప గడపకూ కరపత్రాలను పంచేవారు.

ఉద్యమం బాగా ఉద్ధృతంగా జరుగుతూ వుంది. అప్పుడు ఇంగ్లాండ్ ప్రధాన మంత్రి భారతదేశానికి ఇయ్యబోయే రాజ్యాంగ సంస్కరణలలో చొప్పించిన నిర్ణయం ప్రకారం అంటరానివారుగా పరిగణింపబడేవారు హిందువులకంటె వేరు జాతిగా, ప్రత్యేక నియోజక వర్గాలద్వారా వేరే తమ ప్రతినిధులను ఎన్నుకొనవచ్చును.

జెయిలులో ఉన్న గాంధీజీకి ఈ నిర్ణయం తెలిసింది. ఇటువంటి నిర్ణయాన్ని ఆంగ్లప్రభుత్వం అమలు పరిచినట్లయితే గాంధీజీ తన ప్రాణాలను ఒడ్డి అయినా ఆ నిర్ణయాన్ని ఎదుర్కొంటానని ప్రకటించారు. ఆ నిర్ణయం అమలుపరిచిన ప్రకటన వినగానే గాంధీజీ నిరాహార దీక్ష ప్రకటించారు.

1932 సెప్టెంబర్ 20 వ తేదీని బాపూ ఉపవాసం ప్రారంభించారు. దేశం

అంతటా వేలకొద్దీ ప్రజానీకం ఆయన ప్రాణాలు నిలబెట్టడానికి ఈశ్వరుణ్ణి ప్రార్థిస్తూ, తాము కూడా ఉపవాసాలు చేశారు. ఆ ఉపవాసం మూలంగా అగ్ర వర్ణ హిందువుల హృదయాలలో పరివర్తన కలిగి, దానివల్ల నిమ్నజాతుల నాయకుల మనస్సులు కూడా కరిగాయి. చివరికి గాంధీజీ సమక్షంలో ఉభయవర్గాల పెద్దలూ సమావేశమై ఒక ఒప్పందం చేసుకుని, దాని ప్రకారం బ్రిటిషుప్రభుత్వం వారిని ఆ ప్రత్యేక నియోజకవర్గ నిర్ణయాన్ని రద్దు చెయ్యమని కోరారు. ఆ నిర్ణయం రద్దు అయింది. అగ్రవర్ణ హిందూ నాయకులు అంటరానితనాన్ని రూపుమాపుతామని గాంధీజీకి వాగ్దానం చేశారు. గాంధీజీ ప్రాణాలు నిలబడ్డాయి. ఆయన, అంటరానితనాన్ని నిర్మూలించడానికి పూనుకున్నారు. అంటరానివారికి హరిజనులని, దేవునికి ప్రియజనులనే అర్థం వచ్చే పేరు గాంధీజీయే పెట్టి, తమ ఇంగ్లీషు, హిందీ, గుజరాతీ పత్రికలకు అప్పటివరకూ ఉంచిన పాత పేర్లు తీసివేసి, 'హరిజన' అనే పేరే ఉంచారు. అంతేకాదు ఆయన సాబర్మతీలోని తన ఆశ్రమాన్ని హరిజనోద్యమ కార్యకర్తల ఆశ్రమంగా మార్చివేశారు.

అప్పుడు సత్యాగ్రహులలో చాలామంది ఆయన చేపట్టిన హరిజనోద్ధరణ కార్యక్రమంలో తోడుపడుతూ వచ్చారు. కొందరు మాత్రం సత్యాగ్రహోద్యం సాగుతూనే ఉండాలని కోరారు. గాంధీజీ సలహాపైని సామూహిక సత్యాగ్రహం ఆపుచేశారు కాని, చెయ్యదలచుకొన్నవారు కొందరు వ్యక్తిగత సత్యాగ్రహం చేయడానికి ఆయన అనుమతి పొందారు. ఈలోగా ఢిల్లీలోని కేంద్రీయ శాసన సభకు ఎన్నికలు వచ్చాయి. కాంగ్రెసువారు ఆ ఎన్నికలలో తమ ప్రతినిధులను అభ్యర్థులుగా నిలబెట్టడానికి నిశ్చయించారు.

1935 లో బ్రిటిషు ప్రభుత్వం భారతదేశానికి కొత్త రాజ్యాంగ సంస్కరణలను ప్రకటించారు. దానిని అనుసరించి 1937 లో అన్ని రాష్ట్రాలలోను కూడా శాసన సభలకు కొత్తగా ఎన్నికలు జరిగాయి. ముసల్మానుల కంటె హిందువులు ఎక్కువ జనాభా గల రాష్ట్రాలు అన్నిటిలోను కాంగ్రెసువారే ఎక్కువ అభ్యర్థులు ఎన్నికయినారు. మరి ముసల్మానులే ఎక్కువగా ఉన్న పశ్చిమోత్తర పరగణాలలో కూడా కాంగ్రెసు ప్రతినిధులే అధిక సంఖ్యలో ఎన్నికయినారు.

గాంధీజీ ఉపదేశించిన అహింసాత్మక సత్యాగ్రహ సేనానులలో ప్రసిద్ధుడు ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్. మాట పట్టింపుకైనా యుద్ధంచేసి చావుకు వెనుదీయని పఠానుల జాతికి చెందినప్పటికీ ఖాన్‌సాహేబ్ అహింసా మార్గావలంబన ద్వారా గాంధీజీని అన్ని విధాలా అనుసరించాడు. అందుకే ఆయనకు సరిహద్దు గాంధీ అని పేరు వచ్చింది. ఆయన 1930 లోనే పెషావర్‌లో 'ఖుదాయీ ఖిద్మత్‌గార్'లు అను పేర పఠానులతో ఒక అహింసాత్మక దళాన్ని ఏర్పాటుచేశారు.

ఒడ్డూ, పొడుగూ, కలిగి, బలిష్ఠమైన దేహాలుగల పఠానులు చేతులకు సంకెళ్లుతాల్చి, కిక్కురుమనకుండా లాఠీ దెబ్బలు తింటూంటే, చూసి, దేశం అంతా

విస్తుపోయింది. ప్రభుత్వము వారిపట్ల ఘోరాతి ఘోరంగా ప్రవర్తించింది. ఒక సారి ఒక పటాలపు అధికారి నిరాయుధులైన సత్యాగ్రహులపై తుపాకి పేల్చడానికి నిరాకరించినందుకు కోర్ట్ మార్షల్ విచారణకు గురి అయినాడు.

అయితే, ఎన్నికలలో సరిహద్దు గాంధీకే విజయం లభించింది. వోటర్లు, కాంగ్రెస్ ప్రతినిధులను అధిక సంఖ్యాకులను కౌన్సిల్‌కు ఎన్నుకొన్నారు. అయితే కాంగ్రెసు వారు ఈ శాసన సభలలో ప్రవేశించి మంత్రివర్గం ఏర్పాటు చెయ్యడానికి ఇష్టపడలేదు.

కాంగ్రెసువారు తమ మంత్రి వర్గాలను ఏర్పరచడానికి సిద్ధపడకపోతే మళ్లీ అటకట్టు అవుతుందని ఆంగ్ల ప్రభుత్వానికి తోచింది. గాంధీజీకి వైస్రాయితో దీర్ఘంగా ఉత్తర ప్రత్యుత్తరాలు సాగాయి. గవర్నర్లు కాంగ్రెసు ప్రభుత్వాల నిర్ణయాలను త్రోసిపుచ్చకుండా వాగ్దానం చేసేటట్లయితే కాంగ్రెసువారు మంత్రి వర్గాలను ఏర్పాటు చేస్తామని చెప్పారు. ఈ వాగ్దానం చెయ్యడానికి బ్రిటిషు ప్రభుత్వంవారు కొంతకాలం తటపటాయించారు. అంతేకాకుండా, శాసన సభలలోని కాంగ్రెసేతర పక్షాలు ప్రభుత్వాలు ఏర్పాటు చెయ్యడానికి ప్రయత్నించారు. అయితే, ఆ ప్రభుత్వాలు ప్రవేశపెట్టిన బిల్లులను కాంగ్రెసు సభ్యులు అధిక సంఖ్యాకులు తిరస్కరించి, రద్దు అయేటట్లు చేసేవారు.



ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్

ఆఖరికి వైస్రాయి కాంగ్రెసువారు కోరిన వాగ్దానానికి సమ్మతించాడు. ఆంగ్ల ప్రభుత్వం మన దేశానికి రాష్ట్రాలలో ఈ విధంగా 'ప్రాంతీయ స్వరాజ్యం' ఇయ్యక తప్పలేదు. దేశంలో ఎక్కువ సంఖ్య రాష్ట్రాలలో కాంగ్రెసు ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. ప్రపంచంలో అంతవరకు ఎవ్వరూ ఊహించని విధంగా సత్యాగ్రహ మహిమద్వారా కొద్ది సంవత్సరాలలోనే కాంగ్రెసువారు సాధించగలిగారు.

ప్రాంతీయ స్వరాజ్యం లభించిన మూడేళ్లలోనే రెండవ ప్రపంచ మహాయుద్ధం ప్రారంభమయింది. జర్మనీకి వ్యతిరేకంగా జరుపుతున్న ఆ యుద్ధంలో

ఇంగ్లాండు భారతదేశాన్ని, ఎన్నికయిన భారతీయ నాయకులతో సంప్రదించ కుండానే, తన పక్షాన యుద్ధంలో దింపడానికి నిశ్చయించింది.

దేశం అంతటా దీనిని పెద్ద అవమానంగా పరిగణించారు. కాంగ్రెసు నాయకుల నిర్ణయానుసారము దేశంలో అన్ని రాష్ట్రాలలోను కాంగ్రెసు ప్రభుత్వాలు రాజీనామా చేశాయి.

యుద్ధకాలంలో ఇంగ్లాండ్‌లో అధికారంలో ఉన్న చర్చిల్ ప్రధాని ప్రభుత్వము ఘోర పరాజయాల నడుమకూడా ధైర్యం విడవకుండా వీరత్వ సాహసాలతో పోరాటం సాగిస్తూ, భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రసక్తి వచ్చినప్పుడల్లా బొత్తిగా ముఖావం వహిస్తూ వచ్చింది. అందుచేత, 1942 లో జర్మనీకి జపాను తోడయి, సింగపూరు, బర్మాలనుంచి బ్రిటిషువారిని తరిమివేసి, భారతదేశం పైకి రావడానికి సిద్ధంగా ఉన్నప్పుడు, కాంగ్రెసువారికి తిరిగి దేశ వ్యాప్తమయిన సత్యాగ్రహం చెయ్యడం తప్ప వేరే మార్గం తోచలేదు. 'మీరు భారతదేశం వెంటనే వదిలిపెట్టి పొండి. జపానువారి దాడినుంచి మమ్మల్ని మేమే రక్షించుకుంటాం' అని గాంధీజీ ఆంగ్ల ప్రభుత్వానికి స్పష్టంగా హెచ్చరించారు.

ఈ సందర్భంలో, నేతాజీ సుభాష్‌చంద్రబోసును మనం ఎంతమాత్రమూ మరువజాలము. రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభం అయాక, ఆయన తన గృహంలోనే నిర్బంధంలో ఉన్న రోజులలో ఏదో ఉపాయంతో దేశంనుంచి తప్పించుకుని పరారి అయి, ఒకరోజు అకస్మాత్తుగా జర్మనీలోని బెర్లిన్ రేడియో నుంచి స్వదేశీయులకు తన సందేశం వినిపించారు. ఆ తరువాత నేతాజీ కొంత కాలం జర్మనీలోను, కొంతకాలం ఇటలీలోను, కొంతకాలం జపానులోను గడిపారు. భారతీయులను బానిసలుగా ఉంచిన ఆంగ్లేయులకు శత్రువైన ప్రతి దేశంతోను ఆయన చెలిమి చేశారు.

## ఆజాద్ హింద్ సైన్యమూ, క్విట్ ఇండియా ఉద్యమమూ :

జపానువారికి ఖైదీలుగా చిక్కిన భారతీయ సైనికులను అందరినీ కూడదీసి, సుభాష్‌చంద్రబోసు వారిని 'ఆజాద్ హింద్ ఫౌజ్' (స్వతంత్ర హైందవ సైన్యం)గా తయారుచేసి తాను వారికి నేత (సైన్యాధిపతి) అయినాడు. ఆ సైనికులంతా ఆయనను నేతాజీ అనేవారు. ఆ కాలంలో సైనికుల వందన నినాదంగా 'జైహింద్' అనడం పరిపాటి చేసినది నేతాజీయే.

ఈ విధంగా 1942 లో ఒక పక్కనుంచి నేతాజీ జపాన్ రేడియో ద్వారా భారత ప్రజలకు సందేశాలు ప్రసారంచేస్తూ ఆంగ్లేయులను తరిమివేస్తే భారత

దేశాన్ని స్వతంత్రం చెయ్యడానికి జపాను సహకరిస్తుందని భరోసా కలుగజేసే వారు. ఇంకొక పక్కనుంచి గాంధీజీ మన దేశీయులకు 'ఆంగ్లేయులారా, భారత దేశం వదలిపొండి (క్విట్ ఇండియా)' అనే నినాదాన్ని ప్రసాదించారు.

అంతేకాకుండా, అస్సాం, బెంగాల్, బీహారులను వదిలిపెట్టి వెనక్కి పోవడానికి సిద్ధంగా ఉండమని ఆంగ్ల సైనికులకు తమ అధికారులు ఆజ్ఞ జారీ చేశారు. అలా తిరోగమించే బ్రిటిషు సైనికులు తమ దారిలోని పెద్ద పెద్ద కార్ఖానాలను, రైలు మార్గాలను, వంతెనలను జపాను వారి చేతులలో పడకుండా ధ్వంసం చేసుకుంటూ పోతారనే వార్త కూడా కాంగ్రెసు వారికి అందింది. అయితే గాంధీజీ అటువంటి విధ్వంసకాండ జరగడానికి వ్యతిరేకించారు. భారతీయులకు చెందిన విలువైన ఆస్తిపాస్తులను నష్టపరిచే అధికారం బ్రిటిషువారి కెవరిచ్చారని ఆయన అడిగారు.

చివరికి 1942 ఆగస్టులో కాంగ్రెసుకూ బ్రిటిషు ప్రభుత్వానికీ బాహాటంగా పోరాటం మొదలయింది. "పోరో, చావో" (కరో యా మరో) తేల్చుకోండని గాంధీజీ దేశీయులందరినీ ఆజ్ఞాపించారు. రెండు పక్కలా భయంకర పోరాటంలో బ్రిటిషువారు చిక్కుకోవాలనే, గాంధీజీ అలా ఆజ్ఞ జారీచేశారు.

దేశం అంతటా కల చిన్నా పెద్దా కాంగ్రెసు నాయకులందరినీ బ్రిటిషు ప్రభుత్వం ఒక్కసారిగా, జెయిళ్లకు పంపారు. నాయకులు లేని సామాన్య జనం రైలుపట్టాలను తొలగించీ, తంతి స్తంభాలను పెళ్లగించీ, రహదారులనూ వంతెనలనూ నాశనం చెయ్యడం మొదలుపెట్టారు. సైనికులూ పోలీసులూ తుపాకులు కాల్చారు.

ఎందరో వేలకొద్దీ జనం మరణించారు. ప్రతీకారంగా జన సమూహాలు పోలీస్ చౌకీలపై పడి తగులబెట్టారు. కొన్ని రోజుల వరకూ దేశం అంతటా అగ్నిజ్వాలలు రేగాయి.

రైలుబళ్లు నిలిచిపోయాయి - రైలు పట్టాలు అనేకచోట్ల ఇంతా అంతా దూరం అని చూడక లాగి పారవేశారు. ఎన్ని రోజులదాకానో సైనిక పటాలాల రాకపోకలు ఆగిపోయాయి. అనేక చోట్ల రహదారులను తవ్వి పారేశారు - ఎన్నో చిన్న చిన్న వంతెనలను కూల్చి వేశారు. సైనిక శకటాలు (జీపులూ, ట్రక్కులూ) ఒక చోటనుంచి మరొక చోటికి పోవడానికి దారులు కట్టు పడి పోయాయి.

దేశం అంతటా విచ్ఛిన్నమయిన ప్రతి దానినీ మరమ్మత్తు చేయించడానికి బ్రిటిషు వారికి ఎన్నో మాసాలు పట్టింది.

విధ్వంసకాండలో నిమగ్నులయిన ఉద్యమకారులను జెయిళ్లలో ఎన్నో రీతుల హింసలకు, కఠిన చర్యలకు, గురిచేసి, దొరకకుండా పారిపోయిన సహ చరుల ఆచూకీ తెల్పమని కోరేవారు. బీహారు జెయిల్ నుంచి తప్పించుకుని పారి



సుభాష్ చంద్రబోసు

పోయి అజ్ఞాతంగా సంచరిస్తూ విప్లవ కార్యాలను కొనసాగిస్తూన్న జయప్రకాశ్ నారాయణ్‌ను చివరికి తిరిగి నిర్బంధించి, లాహోరు జెయిల్‌లో ఘంటల తరబడి మంచురాళ్ల పైని కూర్చోబెట్టి, ఎంతరాత్రయినా సరే పడుకోనీయకుండా బాధలు పెట్టగా, ఆయన తమ రహస్య సమాచారం అంతా వెల్లడించవలసి వచ్చింది.

రెండు, రెండున్నర మాసాలు దేశం అంతా పెద్ద కారాగారమా అని పించింది. ఆంగ్ల సైనికులకు కూడా అడుగడుగునా కష్టాలను ఎదుర్కొనవలసి వచ్చేది.

అయితే, ఈలోగా యుద్ధంలో జర్మనీ తిరోగమన ధోరణిలో పడనారంభించింది. సోవియట్ యూనియన్ జర్మనీ పళ్లూడగొట్టడం మొదలుపెట్టింది. రష్యన్లు జర్మను సైన్యాలను వెనుకంజ వేయిస్తూండేసరికి అమెరికా సైన్యాలు తోడు కాగా బ్రిటిషువారు జర్మనీపై రెండవ పక్క పోటు ప్రారంభించారు. తూర్పున జపాను పురోగతికి కూడా నిరోధం ఏర్పడింది.

చివరికి గాంధీజీ చెరసాల నుంచి విడుదల అయారు. మిగిలిన నాయకులను కూడా మెల్లి మెల్లిగా విడుదల చేస్తూ వచ్చారు. బ్రిటిషు ప్రభుత్వం, వారిని తిరిగి మంచి చేసుకోవడానికి ప్రయత్నాలు మొదలుపెట్టింది.

కాని దేశంలోని ప్రజానాయకులు సంపూర్ణ స్వరాజ్యాన్ని మినహాయించి ఏ ఒప్పందానికీ సిద్ధంగా లేరు.

1945 లో రెండవ ప్రపంచ యుద్ధం సమాప్తం అయింది. దానికి కొంచెం ముందుగానే భారతదేశానికి తూర్పు సరిహద్దులలో జపాను వారి పరాజయాలు సంభవించాయి. నేతాజీ సుభాష్ చంద్రబోసు అనుచరులయిన ఆజాద్ హింద్ సైనికులను చాలమందిని నిర్బంధించి మన దేశానికి తీసుకువచ్చి, వారిపై రాజద్రోహ నేరానికి విచారణ జరిపారు. ఈ వీరయోధుల విముక్తి కోసం దేశం అంతటా పలుచోట్ల ఏకగ్రీవంగా అర్థిస్తూ ప్రదర్శనలు చేశారు. జపాను పరాజయానికీ ప్రపంచ యుద్ధ సమాప్తికీ సుమారు దరిదాపులలోనే జపాను యాత్ర చేస్తున్న ఒక విమానం అగ్ని ప్రమాదం వల్ల కూలి, అందులో నేతాజీ సుభాష్ చంద్రబోస్ మరణించిన వార్త దేశం అంతటినీ శోక సాగరంలో ముంచివేసింది.

ఆజాద్ హింద్ ఫౌజ్‌లోని ఉద్యోగుల పైనీ, సిపాయీల పైని ఢిల్లీలోని లాల్ ఖిల్లాలో రాజద్రోహ నేరం గురించి విచారణ మొదలుపెట్టారు. దేశ ప్రజలందరి దృష్టి ఆటువైపు కేంద్రీకృతం అయింది. వారిని విడిపించడానికి దేశంలోని ప్రతిష్ఠగల న్యాయవాదులు తమ శక్తినంతా వినియోగించారు. ఆపాటికి జవాహర్‌లాల్ నెహ్రూ కూడా నల్లని తన బ్యారిష్టర్ గౌన్ ధరించి, ఆజాద్ హింద్ వీరుల పక్షాన వాదించడానికి వెళ్లారు.

ఈ విచారణ కార్యకలాపాలు పత్రికలలో బాగా విస్తరించి వివరాలతో ప్రకటించేవారు. ఈ విచారణ సందర్భంలో నేతాజీ సుభాష్ బోస్ వీరత్వాన్ని గురించిన ఘట్టాలు ప్రజలు మళ్లీ మళ్లీ చదువుకుని నేతాజీ పట్ల వెర్రి అభిమానాన్ని పెంచుకున్నారు. కొన్నాళ్ల తరువాత 1946 జనవరి నెలలో ఆయన జన్మదినం వచ్చినప్పుడు దేశం అంతటా ఏకటాకీని ఉత్సవాలు జరిపారు. ఇంత జరిగాక, నేతాజీ అసలు విమాన ప్రమాదంలో మరణించారన్న మాటను ప్రజలు విశ్వసించ



1942, క్విట్ ఇండియా ఉద్యమం

లేకపోయారు. ఆయన ఆజాద్ హింద్ ఫౌజ్‌లోని నాయకులయిన కెప్టన్ షా నవాజ్‌ఖాన్, కెప్టన్ కర్నల్ దిల్లోన్, కెప్టన్ సహ్‌గల్ వీరి పేర్లు విచారణ గురించిన వార్తలలో పత్రికలద్వారా చదివిన ప్రజల దృష్టిలో ప్రకాశవంతమైన తారలుగా వెలుగొందాయి.

చివరికి బ్రిటిషు ప్రభుత్వపు సింహాసనం వణక నారంభించింది. కోర్టు విచారణలో చట్టరీత్యా ఆజాద్ హింద్ వీరులకు దీర్ఘకాలం చెరసాలలో ఉంచే శిక్షలు విధించినా, ప్రభుత్వం వారు ప్రజల ఆగ్రహానికి జంకి, వారిని వెంటనే విడుదల చేశారు.

నేతాజీ ప్రసాదించిన 'జైహింద్' నినాదం ఆనాటి నుంచే మన భారతీయు లందరికీ అత్యంత ప్రియతమ నినాదం అయింది.

దేశం అంతటా మరొక్కసారి హింసాత్మక విప్లవం తల ఎత్తింది. కలకత్తా వంటి నగరాలలో ఒక్కొక్కసారి ఆంగ్లేయులైనవారు నగర వీధులలోకి కనబడ డానికే వీలులేకపోయేది. తెల్ల పోలీసులూ, సైనికులూ తిరుగాడే జీపు కారులను యువకులు రోడ్ల పైని అటకాయించి తగులబెట్టేవారు. ప్రజల మనస్సులలోనుంచి సైనికులంటే భయం అన్నమాట తుడిచి పెట్టుకుపోయింది. చిన్న చిన్న పిల్లలు సైతం తెల్ల సెంట్రీ దగ్గరకు వెళ్లి నుంచుని, వారు సవాల్ చేస్తే కొంచెమైనా బెదిరేవారు కారు.

విప్లవపు నిష్పురవ్వలు అలా గాలిలో తేలి తేలి, బ్రిటిషు హయాంలోని భారతీయ సైనికులలోకి కూడా విద్రోహ లక్షణాలను చొప్పించగలిగాయి. 1946 ఫిబ్రవరిలో భారతీయ నౌకాదళ సిబ్బంది వారు తిరుగుబాటుచేసి, కొన్ని రోజుల దాకా తమ దళానికి చెందిన తెల్ల ఉద్యోగుల ఆజ్ఞలను దిక్కరించారు. బొంబాయిలో ఈ తిరుగుబాటును సమర్థిస్తూ నగరంలోని పౌరులు హర్తాళ్ జరిపి, అందులో కొందరు ప్రభుత్వ భవనాలను, ఆస్తులను తగులబెట్టి, దోచుకోవడం మొదలు పెట్టారు. పోలీసులు తుపాకులు కాల్చారు. ఆ కాల్పులలో మరణించినవారు 200 కు మించి వుంటారు. సర్దార్‌పటేల్ మధ్యవర్తిత్వం ద్వారా కేంద్ర ప్రభుత్వా నికీ నౌకాదళ సిబ్బందికీ నడుమ రాజీ చేసి ఉండకపోతే ఈ అగ్ని ఎంత దూరం పోయేదో ఊహించడానికి వీలుకాదు.

ప్రపంచ యుద్ధం పూర్తి అవుతూండగా ఇంగ్లాండ్‌లో తిరిగి ఎన్నికలు జరి గాయి – ఈసారి అక్కడ చర్చిల్ ప్రభుత్వానికి బదులు కార్మిక పక్ష నాయకుడయిన అట్లీ ప్రభుత్వం అధికారానికి వచ్చింది. భారతదేశంలో కూడా, ప్రపంచ యుద్ధా నికి పూర్వం ఉన్న రాష్ట్ర ప్రభుత్వాలను తిరిగి అమలులోనికి తెచ్చి, రాష్ట్ర శాసన సభలకు కొత్త ఎన్నికలు జరిపించారు. పూర్వం అధికారం చలాయించిన అన్ని రాష్ట్రాలలోను కాంగ్రెస్ తిరిగి మంత్రి వర్గాలను ఏర్పాటు చేసికోగలిగింది. అయితే, భారతీయులు ఈ సగం స్వరాజ్యంతో సంతుష్టి చెంది ఊరుకోలేరు అని

ఆంగ్ల ప్రభుత్వం తెలుసుకోగలిగింది. ఇంకా ఆలస్యం అయితే, ఆంగ్లేయులను ఈ దేశం నుంచి అగౌరవపరచి తరిమివేయవచ్చు; అప్పుడు స్వతంత్ర భారతం శాశ్వతంగా బ్రిటనుకు బద్ధ శత్రువు అయిపోతుంది.

## కేబినెట్ మిషన్

చివరికి, భారతదేశ స్వారాజ్యపు రూపురేఖలు దిద్దితీర్చడానికి బ్రిటిషు మంత్రి వర్గం వారు ముగ్గురు మంత్రివర్గ సభ్యులను మన దేశానికి పంపారు. అయితే, ఆంగ్లేయులు ఏళ్ల తరబడి భారత ప్రజల నడుమ ప్రయత్న పూర్వకంగా ఏర్పాటు చేసిన విభేదాలూ, కలహాలూ ఈనాడు ఆంగ్లేయులు కూడా రూపు మాపడానికి వశం కానంత పెద్దవయిపోయాయి. హిందువులకూ, హిందువులకూ నడుమ, అంటే అగ్ర జాతులకూ అంటరానివారికీ నడుమ బ్రిటిషువారు నాటదల చిన కలహ బీజాలు గాంధీజీ నిరాహారదీక్ష వల్లనూ, హరిజనోద్ధరణ ఉద్యమం ద్వారానూ, చిగిరించక ముందే మాడిపోయాయి. కాని, హిందూ ముస్లిముల నడుమ వారు నాటిన కలహబీజాలు మాత్రం తీగలు సాగి పెరుగుతూ వచ్చాయి.

ప్రపంచ యుద్ధం పూర్తయేసరికి బ్రిటిషువారు భారతదేశంలో తాము చిక్కుకున్న అడుసులోనుంచి బయటపడే ప్రయత్నంలో బ్రిటిషు మంత్రివర్గ సభ్యులు ఇక్కడికి వచ్చారు. అయితే, ముస్లిం లీగ్ నాయకుడు జిన్నా సాహెబ్ దేశాన్ని రెండు భాగాలుగా విభజింపక పోయినట్లయితే, ఢిల్లీలోని కేంద్ర ప్రభుత్వంలో హిందూ మంత్రుల సంఖ్యతో సమానమైన సంఖ్యలో ముస్లిం మంత్రులుండాలనీ, ముస్లిం మంత్రులు పూర్తిగా ముస్లిం లీగు ప్రతినిధులే, అంటే జిన్నాసాహెబ్ ఏరు కొన్నవారే ఉండితీరాలనీ మొండిపట్టు పట్టారు.

ఈ విధానాన్ని కాంగ్రెస్ ఎలా ఎదుర్కోగలిగింది? వారు తమ సంస్థ కేవలం హిందూ సంస్థగా ఒప్పుకొనదలచుకోలేదు; మరి, కాంగ్రెస్ వాదులయిన ముస్లిముల విశ్వాసాన్ని చెడగొట్టుకోవడానికి సిద్ధంగా లేరు.

ఏదో దారి నిర్ణయిద్దామని వచ్చిన బ్రిటిషు మంత్రివర్గ సభ్యులు కొంతవరకు శ్రమపడి, విసుగు చెందారు కాని, జిన్నాసాహెబ్‌ను మాత్రం ఒక దారికి తీసుకు రాలేకపోయారు.

స్వారాజ్యం ఏ తరహాలో ఉండాలి, దాని స్వరూపం ఎలా ఉండాలి, ఢిల్లీలో ఏర్పడే కేంద్ర ప్రభుత్వంలో దేశంలోని అన్ని వర్గాల ప్రజలకు ఎవరెవరికెంత ప్రాతినిధ్యం ఉండాలి, ఇటువంటి సమస్యలన్నీ చర్చించి నిశ్చయించేటందుకు ఆంగ్ల ప్రభుత్వము రాజ్యాంగ విధాన పరిషత్తు నొకదానిని ఏర్పాటు చెయ్యడానికి నిశ్చయించింది. ప్రభుత్వం చేసిన మరొక నిర్ణయాన్ని అనుసరించి, ఈ విధాన

పరిషత్తు స్వరాజ్య స్వరూపమును పూర్తిగా దిద్ది తీర్చేవరకు ఢిల్లీలో కేంద్ర ప్రభుత్వం కొనసాగించడానికి ఒక మంత్రి మండలి వైస్రాయికి సహాయంగా పని చెయ్యాలి.

ఈ నిర్ణయాలను కాంగ్రెస్ అంగీకరించింది. కాని, జిన్నాసాహెబ్ తాను వెనుక సూచించిన షరతులను ససేమిరా వదలలేదు. అంతేకాదు; ఇంగ్లాండ్ ప్రభుత్వం తమకు పూర్తిగా (ఈ షరతులద్వారా) సంతృప్తి కలిగించకుండానే ఈ దేశం వదలి వెళ్లిపోతుందేమో అనే భయంకూడా కలిగింది. అందుకని, వారిని భయపెట్టి, లొంగదీసుకోవడానికని, 1946 ఆగస్టు 16 వ తేదీని భారత దేశంలోని ముస్లిములకు ప్రత్యక్ష చర్యా దినం (డైరెక్ట్ ఏక్షన్ డే) గా ప్రకటించారు. ఈ ప్రత్యక్ష చర్య లేక బహిరంగ పోరాటం అసలు ప్రభుత్వమైన బ్రిటిషువారికి వ్యతిరేకంగా కాదు; కాంగ్రెస్‌కు వ్యతిరేకంగాను - అంటే - అదే హిందూ ముస్లిముల జగడాలకు ఆరంభం!

హిందూ ముస్లిముల ఐక్యతకోసం గాంధీజీ, కాంగ్రెసూ, ఏళ్లతరబడి పడిన శ్రమ అంతా ఒక్క రోజులో నాశనం అయిపోయింది.

ఇంకా ఏమయింది? దేశం అంతటా హిందూ ముస్లిం కలహాలు అడివిలో కార్చిచ్చులాగా చెలరేగాయి. మొదట కలకత్తాలో భయంకర రక్తపాతం! ఆ తర్వాత బెంగాల్‌లోని ఢాకా, నౌఖాలీవంటి జిల్లాలలో – ముసల్మానులు అధిక సంఖ్యాకులుగా ఉన్నచోట్ల హిందువులను చంపివెయ్యడం మొదలుపెట్టారు. అలాగే హిందువులు అధిక సంఖ్యలో ఉన్న బీహారు మున్నగు ప్రాంతాలలో ముస్లిముల వధ జరిగింది. జిన్నాసాహెబ్ దూరాన్నుంచి తమాషా చూస్తూ ఉన్నాడు. గాంధీజీ, జవాహర్‌లాల్ నెహ్రూ, రాజేంద్రప్రసాద్ వంటి కాంగ్రెస్ నాయకులు మాత్రం హిందువుల బారినుండి ముస్లిములను కాపాడడానికి చాలా పదయాత్రలను కూడా సహించి పాటుపడ్డారు.

అప్పుడు వైస్రాయ్ లార్డ్ వేవెల్ గత్యంతరంలేక, జిన్నాసాహెబ్‌ను లక్ష్యపెట్టక, కేవలం కాంగ్రెస్ పార్టీవారి సలహాను అనుసరించి, ఢిల్లీలో కేంద్ర మంత్రి మండలిని ప్రకటించాడు. దానికి అధ్యక్షుడు (ప్రధాని) జవాహర్‌లాల్ నెహ్రూ, ఇంకా కాంగ్రెస్‌లోని పెద్ద పెద్ద నాయకులైన సర్దార్‌పటేల్, రాజేంద్ర ప్రసాద్, రాజగోపాలాచారి ఆ మండలిలో చేరారు. ఈ ఆటలిక సాగవని తోచి జిన్నాసాహెబ్ గత్యంతరంలేక చివరికి లొంగవలసి వచ్చింది. నెహ్రూజీ నాయకత్వంలో ఏర్పడిన మంత్రి మండలిలో కొత్తగా మార్పుచేసి, ముస్లింలీగు మంత్రులకు కూడా అందులో స్థానం ఇచ్చారు.

ఈసారి జిన్నాసాహెబ్ మరో త్రోవ తొక్కాడు. మంత్రి మండలి నాయకుడైన నెహ్రూ నిర్ణయాలను ముస్లిం లీగు మంత్రులెవరూ లక్ష్యపెట్టకూడదనీ, మంత్రి మండలిలో అధిక సంఖ్యాకులు చేసిన నిర్ణయాలను అమలుపరచవద్దనీ

ముస్లింలీగు మంత్రులకు జిన్నా ఆదేశించాడు. ముస్లింలీగు మంత్రియైన లియాకత్ అలీఖాన్ చేతిలో ఆర్థికశాఖ ఉండేది. ప్రభుత్వ ఖర్చులన్నిటినీ ఆయనే మంజూరు చేసేవాడు. కాంగ్రెస్ మంత్రులు కోరిన పద్దుల తాలూకు డబ్బు మంజూరు చెయ్యడానికి ఆయన నిరాకరించేవాడు. దానివల్ల పనులన్నీ ఎక్కడి వక్కడ నిలిచిపోయేవి. కొత్త రాజ్యాంగం నిర్ణయించడానికి రాజేంద్రప్రసాద్ అధ్యక్షతను సమావేశం అవుతూ ఉండే విధాన పరిషత్తులో కూడా ముస్లిం లీగు ప్రతినిధులు వేరుగా కూర్చుని తమ షరతులద్వారా మొండిపట్టు పట్టేవారు.

ఈ సంగతులన్నింటినీ జవాహర్‌లాల్ నెహ్రూ వైస్‌రాయికి తెలియపరచి, లండన్‌లోని బ్రిటిషు ప్రధాన మంత్రికి కూడా వ్రాశారు. ఈ పేచీలతో ఒక సమయంలో నెహ్రూ రాజీనామా చేద్దామని నిశ్చయందాకా రావలసి వచ్చింది.

బ్రిటిషు ప్రభుత్వానికి కాలు సేతులు పూర్తిగా చల్లబడ్డాయి. లార్డ్ వేవెల్‌ను రాజీనామా చెయ్యమన్నారు. లార్డ్ మౌంట్‌బ్యాటెన్‌ను కొత్త వైస్‌రాయ్‌గా భారతదేశానికి పంపించారు. అలా పంపుతూనే, కొన్ని మాసాలలోపున భారత దేశాన్ని వదిలి వెళ్లిపోతున్నామని ప్రకటించారు. ఇప్పుడు ఆంగ్లేయులు భారత దేశంలో నిలదొక్కుకుని ఉండడం వారి శక్తికి మించిన పని అయింది. స్వాతంత్ర్యోద్యమం సమాప్తమయేటట్లు లేదు. జిన్నాసాహెబు తన హఠాన్ని వదలేటట్లు లేడు. చివరికి భారతదేశపు తుది వైస్‌రాయ్ లార్డ్ మౌంట్‌బ్యాటన్ తయారు చేసిన పథకాన్ని అనుసరించి దేశాన్ని రెండు భాగాలుగా విభజించి ఆంగ్లేయులు వెళ్లిపోవడానికి సిద్ధపడ్డారు.

దేశం అంతటా విషాదం గాఢంగా అలముకొంది. కాంగ్రెస్‌కీ విజయంకాదు, ముస్లిం లీగుకీ కాదు; దేశం అఖండంగా ఉండాలనీ, హిందూ ముస్లిములు సోదరుల వలె జీవించాలీ అన్న గాంధీజీ ఆశయమూ సిద్ధించలేదు, మరి జిన్నా సాహెబు కోరికా తీరలేదు. ఆయనకు లభించిన పాకిస్తాను చీలిన రెండు చెక్కలు మాత్రమే కాదు, ఆ రెండింటికీ నడుమ 1500 మైళ్ల దూరం. ఆయన కోరినది మాత్రం ఇటువంటి పాకిస్తాన్ కాదు.

కాంగ్రెస్‌వారు దేశ విభజన అనే చేదు నిజాన్ని సహించి ఊరుకోవలసి వచ్చింది. కాని, జిన్నాసాహెబ్ దేశం అంతటా హిందువుల పట్ల ముస్లిములలో రగుల్కొల్పిన ద్వేషం ఇప్పుడు కాంగ్రెస్ పట్ల చూపించడానికి వంకలేమీ దొరక లేదు.

పశ్చిమోత్తర సరిహద్దులోని పఠానుల రాష్ట్రాన్ని వారి అభిమతానికి విరుద్ధంగా పాకిస్తాన్‌లో కలిపివెయ్యడం కూడా కాంగ్రెస్‌కు విషాద కారణ మయింది. దీన్ని ఆపుచెయ్యడానికి కాంగ్రెసు ఏమీ చెయ్యలేకపోయింది. సరిహద్దు గాంధీ అయిన ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖానును జిన్నాసాహెబు, ఆయనా ఆయన అనుచరులూ కాంగ్రెస్ పక్షంవారు కావడంచేత తన ముఖ్య శత్రువుగా భావించే



వాడు. స్వరాజ్యం వచ్చేనాటి వరకూ సరిహద్దురాష్ట్రపు ముఖ్యమంత్రి సరిహద్దు గాంధీకి అన్నగారయిన డాక్టర్ ఖాన్ సాహెబ్.

## స్వాతంత్ర్య దినం, 15 ఆగస్టు 1947

చివరికి ఆ శుభదినం వచ్చింది. 1947 అగస్టు 15 వ తేదీని భారతదేశం రెండు స్వతంత్ర దేశాలుగా విభక్తం అయింది. ఆనాడు భారతీయులకు ఒక పక్క దేశవిభజన జరిగిందనే దుఃఖం ఉన్నా, మరొక పక్క స్వతంత్రుల మయామనే ఆనందం వ్యాపించింది.

మన దేశానికి విదేశీయుల పాలన నుంచి విముక్తి లభిస్తుందనీ, స్వాతంత్ర యుద్ధపు సంకేతమయిన మన త్రివర్ణ పతాకం దేశం అంతటా ప్రభుత్వ భవనాలపై ఎగురుతుందనీ, ఎందరికో ఊహకయినా అందని విషయం ఆనాడు వాస్తవమయింది.

అగస్టు 14, 15 వ తేదీల నడుమ అర్ధరాత్రి



లార్డ్ మౌంట్ బ్యాటన్, ఆయన సతీమణి గాంధీజీతో

కొత్త ఢిల్లీలో జవాహర్‌లాల్ నెహ్రూ స్వతంత్ర భారతానికి మొదటి ప్రధాన మంత్రిగా ప్రమాణస్వీకారం చేశారు. అంతేకాక, ఆగస్టు 15 వ తేదీ నాడు లక్ష లాది స్త్రీ పురుషులు హర్షధ్వానములతో అపారమైన ఉత్సాహం ఉప్పొంగగా, ఢిల్లీలోని చరిత్ర ప్రసిద్ధమైన ఎర్రకోట (లాల్ ఖిల్లా) పైన భారత స్వాతంత్ర్య చిహ్నం త్రివర్ణ పతాకను ఎగురవేశారు. ఆ పతాకం గురించిన ప్రసిద్ధ గీతాన్ని పాడుతూ ఎందరెందరు దేశభక్తులు స్వతంత్ర పోరాటంలో బలి అయిపోయారో, ఎందరు జెయిళ్లకు పోయారో, లాఠీ దెబ్బలు తిన్నారో, ఎందరు తుపాకీ గుళ్లకు గురి అయినారో, ఆ గేయమే ఇది :

| | |
|---|---|
| "ఝండా ఊంచా రహే హమారా | "ఆకసమ్ముపై అదె మన జెండా, |
| విజయీ విశ్వ తిరంగా ప్యారా | మూడు రంగులా ముద్దగు జెండా, |
| సదాశక్తి బరసానే వాలా | ఎల్లప్పుడును బలమిచ్చే జెండా, |
| ప్రేమసుధా సరసానే వాలా | ప్రేమసుధను వర్షించే జెండా, |
| వీరోంకే హర్షానే వాలా | వీరుల హర్షము పెంచే జెండా |
| మాతృభూమికా తన్ మన్ సారా" | దేశభక్తి తను మనముల నిండా!" |

దేశం అంతటా ఆనందం వెల్లివిరిసింది. ఉత్సవాలు, విందులు జరిపారు. రాత్రులు దీపావళినాటి కంటె మించిపోయే దీపాలంకరణలు చేశారు. కొన్ని రోజులదాకా ఆనందోత్సవాలు జరుపుతూ రాత్రులు జాగరణంగా గడిపారు.

కాని, గాంధీజీ ఈ ఉత్సవాలన్నిటికీ దూరంగా ఉండిపోయారు. ఆయన హిందూ ముస్లిముల మధ్య సఖ్యభావన పెంపొందించే ప్రయత్నంలో మునిగి ఉన్నారు. తన జీవితాంతం వరకు భారత్, పాకిస్తానులుగా ఏర్పడిన రెండు కొత్త దేశాలలోను హిందూ ముస్లిముల మధ్య ప్రేమ బంధాలను సుస్థాపితం చేసి తీరాలనీ, అవసరమయితే ఆ ప్రయత్నంలో తన ప్రాణాలనైనా ధారపోస్తాననీ ఆయన ఇప్పుడు ఒక వ్రత దీక్ష పట్టారు.

మరి, చివరికి, కొన్ని మాసాల తరువాత 1948 జనవరి 30 వ తేదీని ఆ మహాత్ముడు తన ప్రాణాలను బలి ఇవ్వడం కూడా జరిగిపోయింది.

కొత్తగా స్వరాజ్యం సంపాదించుకున్న ఈ మన దేశానికి ఇటువంటి క్లిష్ట పరిస్థితి కూడా సంభవించింది. గాంధీజీ మార్గదర్శిత్వం మనకు తప్పనిసరిగా అవసరమయే సమయంలో ఆయన మన నడుమ లేకుండాపోయారు. కాని, దేశం లోని మిగిలిన నాయకులంతా ఆ కష్ట సమయంలో ధైర్య స్థైర్యాలతో పరిస్థితి



భారతదేశపు ఆఖరి గవర్నర్ జనరల్ రాజగోపాలాచారి

నెదుర్కొని, కొత్తగా సంపాదించుకున్న స్వరాజ్యాన్ని ఐకమత్యంతో శ్రమపడి కాపాడుకున్నారు.

రాజ్యాంగ విధాన పరిషత్తు దేశానికి కొత్త రాజ్యాంగాన్ని తయారుచేస్తూ ఉంది. ఇంకొక పక్క భారతీయ స్వదేశ సంస్థానాలకు మెల్లిమెల్లిగా భారత దేశంతో కొత్త రాష్ట్రాలుగా కలిసిపోవడం తప్ప తమకు వేరే గత్యంతరం లేదని తోచింది.

1950 జనవరి 26 నాటికి మన కొత్త రాజ్యాంగం సిద్ధమయి, భారతదేశం సర్వతంత్రాత్మక ప్రజాస్వామిక గణ రాజ్యంగా (రిపబ్లిక్‌గా) ప్రకటించారు. కేంద్ర ప్రభుత్వము యూనియన్ ప్రభుత్వం గానూ (సంఘీయ ప్రభుత్వం) ప్రాంతీయ ప్రభుత్వాలు రాష్ట్ర ప్రభుత్వాలుగానూ ప్రకటించారు.

స్వాతంత్ర్య దినోత్సవంనాడు బొంబాయిలోని గేట్ వే ఆఫ్ ఇండియా





డా॥ రాజేంద్రప్రసాద్ భారతీయ గణ తంత్రానికి ప్రథమ రాష్ట్రపతిగా ఎన్నిక అయినారు. ప్రథమ ప్రధానమంత్రి జవాహర్‌లాల్ నెహ్రూ!

# భారత రిపబ్లిక్

## మత ప్రసక్తి లేని లౌకిక రాజ్యం




మేము, భారతీయులం, భారతదేశాన్ని ఒక సర్వతంత్రాత్మక ప్రజాస్వామిక గణరాజ్యంగా రూపొందించేందుకు, సమస్త భారతీయ పౌరులకు,

సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయమూ,

భావ, అభివ్యక్తి, విశ్వాస, ధర్మ, ప్రార్థన స్వాతంత్ర్యము,

ప్రతిష్ఠ మరియు అవకాశములందు సమానత్వమూ,

వ్యక్తిగత గౌరవమూ మరియు జాతీయ ఏకత కాపాడే సకల సౌభ్రాతృత్వమూ పెంపొందించేందుకు,

దృఢ సంకల్పంతో, ఈ రోజు, నవంబరు 1949 ఇరవై ఆరో తారీఖున, ఈ సంవిధాన సభలో, ఈ రాజ్యాంగాన్ని అంగీకరించి, శాసనముగా చేసి, ఆత్మార్పితం చేసుకుంటున్నాము.

# జాతీయ చిహ్నము

స్వతంత్ర భారతదేశానికి ఒక రాష్ట్రీయ (జాతీయ) చిహ్నమును ఎన్నుకో వలసి ఉంది. ఎన్నుకొన్న చిహ్నం ఏమిటంటే, అది అశోక చక్రవర్తి స్థాపించిన సింహ స్తంభమునకు శిఖరాన ఉండే సింహ శిరస్సుల నమూనా! అందులో నాల్గు సింహాలు ఒక దాని వీపును ఒకటి అంటుకొని ఉండేలాగ కూర్చుండి ఉంటాయి. గౌతమ బుద్ధుడు తన శిష్యులకు తన మొట్టమొదటి ఉపదేశము చేసిన చోట అశోకుడు ఈ స్తంభాన్ని నాటించాడు. అయితే మన రాష్ట్రీయ చిహ్నంలో మూడు సింహాలే కనబడతాయి. వాటి క్రింద పీఠంమీద 'సత్యమేవ జయతే' అని చెక్కబడి ఉంటుంది. దానికి 'సత్యమునకే జయము కలుగును' అని అర్థము.

# జాతీయ ధ్వజము

స్వాతంత్ర్య ఉద్యమంలో ప్రజలకు సాహస ప్రోత్సాహాలను కలిగించిన త్రివర్ణ పతాకమునే రాష్ట్రీయ కేతనంగా స్వీకరించడమయినది. అయితే, దాని రూపంలో కొంత మార్పు అవశ్యం అయింది. ఉద్యమపు జెండాలోని రాట్నానికి బదులు రాష్ట్రీయ జెండాలో నడుమ అశోక చక్రాన్ని చేర్చారు. జెండాలోని మూడు చారలలో పై చార రంగు జేగురు. నడుమ చార రంగు తెలుపు. క్రింది చార రంగు ఆకుపచ్చ. నడుమ గల అశోకచక్రపు రంగు దట్టమైన నీలం. ఆ చక్రానికి ఆకులు 26.

# జాతీయ గీతము

రవీంద్రనాథ ఠాకూరు రచించిన 'జన గణ మన' రాష్ట్రీయ (జాతీయ) గీతంగా ఎన్నుకొన్నాము. ఈ గీతం మొట్టమొదటి సారిగా, 1911 డిసెంబరు 27 వ తేదీని కలకత్తాలో జరిగిన భారతీయ జాతీయ కాంగ్రెస్ సమావేశంలో గానం చేశారు.

జన గణ మన అధినాయక జయహే
భారత భాగ్య విధాతా!
పంజాబ సింధు గుజరాత మరాఠా
ద్రావిడ ఉత్కళ బంగ,

వింధ్య హిమాచల యమునా గంగా
ఉచ్ఛల జలధి తరంగ.
తవ శుభ నామే జాగే
తవ శుభ ఆశిష మాఁగే,
గాహే తవ జయ గాథా!
జన గణ మంగళదాయక జయహే
భారత భాగ్య విధాతా!
జయహే, జయహే, జయహే,
జయ జయ జయ జయహే!

